# జమీన్‌రైతు



స్థాపకుడు : నెల్లూరు వెంకట్రామానాయుడు | సంపుటి : 71 | సంచిక : 23 | 9.6.2000 శుక్రవారం | 12 పేజీలు | విడిప్రతి : రూ.2.00లు | జీవప్రదాత : నెల్లూరు శ్రీరామమూర్తి

# పార్టీకి కరెంట్ షాక్!

విద్యుత్ ధరల పెంపకం తెలుగుదేశం పార్టీలోని అసంతృప్త జీవులకు ఒక అస్త్రం వలె పనికి వస్తున్నది. చాలా మంది తెలుగు ఎమ్మెల్యేలు, మాజీ మంత్రులకు ముఖ్యమంత్రిపై మనసు కష్టం వుంది. కాని ఎవ్వరూ నోరు విప్పడానికి సాహసించలేని పరిస్థితి. పార్టీమీద, ప్రభుత్వంపైన చంద్రబాబుకు ఉడుంపట్టు వుండడం అందుకు కారణం. ప్రజలలోనూ పలుకుబడి ఎప్పటికప్పుడు పెరుగుతుండడంతో అసంతృప్త లోలోపలే అణచుకోవడం తప్ప గత్యంతరం కన్పించలేదింత కాలం.

కాని కరెంట్ ధరలతో ఒకసారి పరిస్థితి మారిపోయింది. ముఖ్యమంత్రి దినపత్రికా యాజమాన్యాలను ప్రలోభపెట్టి, నిరసన వార్తలకు ప్రచారం రాకుండా జాగ్రత్త పడుతున్నప్పటికీ - పార్టీ శాసనసభ్యులు ప్రజలలో వినిపిస్తున్న ఆక్రందనలను పసిగట్ట గల్గుతున్నారు. సిపిఎం పార్టీ ఎక్కడ ఏ నిరసన కార్యక్రమం జరిపినా ప్రజలు పోషంగా హాజరు కావడం, ధర్నాలు జయప్రదం కావడం రాజకీయవాదుల

## తుమ్మల వంటి మంత్రులూ ప్రజా నిరసనతో గొంతు కల్పుతున్నారు!

దృష్టిని ఆకర్షిస్తున్నాయి. తమను కలవడానికి వచ్చే సాధారణ ప్రజానీకం ద్వారా ధరల పెంపు ప్రభావం అంచనా వేసుకోగల్గుతున్నారు. ఇప్పటికిప్పుడు రాజకీయంగా దీనివల్ల వచ్చే పరిణామాలేమిటనేది అర్థం కానప్పటికీ తెలుగుదేశం పార్టీ పట్ల ప్రజలలో వైముఖ్యం ఏర్పడుతున్నదన్న విషయం అందరికీ స్పష్టంగా తెలిసిపోతున్నది. కరెంట్, సబ్సిడీ బియ్యం, కిరోసిన్ వంటి ధరల పెంపకం పట్ల ప్రజల తీర్పు వెలువడడానికి గల ఏకైక అవకాశం - పంచాయతీ ఎన్నికలు మాత్రమే! అవి జరగడానికి ఇంకా ఆరేడు నెలల వ్యవధి వుంది. అసంతృప్త జీవులూ అప్పటి వరకు వేచి వుండక తప్పదు. కాని వారిలో అంతటి ఓర్పు కన్పించడం లేదు.

డిప్యూటీ స్పీకర్ చంద్రశేఖర్ తొలి అసమ్మతి అస్త్రం విడిచాడు. కరెంట్ సంక్షోభంపై నోరు విప్పిన ఏకైక తెలుగు శాసనసభ్యుడు ఆయనే. ప్రతిపక్షాలు చేసే విమర్శల కంటే, పాలకపక్షంలోని వారు చేసే వ్యాఖ్యలు బలీయమైనవి, వాటికి పదును ఎక్కువ.

కొరవ 8వ పేజీలో

# రామోజీరావు పుణ్యం

మొదట ప్రకటించిన దాని కంటే కొద్దిగా, కంటి నీటి తుడుపుగా విద్యుత్ ఛార్జీలు తగ్గించడానికి కారణం - ప్రజలలో వెల్లువెత్తిన వ్యతిరేకత కాదు, ఈనాడు పత్రికాధిపతి రామోజీరావు వ్యక్తం చేసిన అసహనం! సాధారణ జనానికి తెలియని నిజం ఇది.

విద్యుత్ ఛార్జీలు తగ్గించడం ముఖ్యమంత్రి చంద్రబాబు నాయుడుకు ఎంత మాత్రం ఇష్టం లేదు. మహానాడులో ఎందరు మంత్రులు, తెలుగు నేతలు మొరపెట్టుకున్నా ఆయన లక్ష్య పెట్టలేదు. ఆరు నూరైనా, నూరు ఆరైనా ధరల విషయంలో పునరాలోచన లేదని తేల్చి చెప్పాడు. కాని విజయవాడ నుంచి హైదరాబాద్ వెళ్లేసరికి "ఈనాడు"లో కరెంట్ ధరల నిరసన వార్తలు కన్పించాయి. దానితో చంద్రబాబుకు ముచ్చెమటలు పట్టాయి. పాతాళభైరవి మాంత్రికుడి ప్రాణం చిలక గొంతులో వున్నట్లు - చంద్రబాబు రాజకీయ జీవం ఈనాడు వార్తల్లో వుంటుందన్నది జగమెరిగిన సత్యం. అందులో తనకు ఇబ్బంది కల్గించే వార్త కన్పడితే చంద్రబాబుకు నిద్రపట్టదు; తిండి సగించదు. మహానాడు నుంచి తిరిగి రాగానే - ఫిలింసిటీలో వున్న రామోజీరావు గారికి ఫోన్ చేసి, కలవడానికి అపాయింట్‌మెంట్ అడిగాడు. ప్రక్కరోజు రాత్రి 8 గంటలకు ఏకోటి గార్డెన్స్‌లోని ఇంట్లో మీటింగ్ నిర్ణయించుకున్నారు. ఈలోగా ఈనాడు విలేఖరులు రామోజీరావు గారికి విద్యుత్ ఛార్జీల పెరుగుదలపై బ్రీఫింగ్ ఇచ్చారు. ముఖ్యమంత్రి రాగానే - రామోజీ రావుగారు విద్యుత్ ధరలు తగ్గించకుంటే, తాను సైతం ప్రభుత్వ వాదనను సమర్థించలేనని; పాఠకులు తన శీలాన్ని శంకించే ప్రమాదం వుందని తేల్చి చెప్పడంతో - చంద్రబాబుకు ఎటూ పాలు పోలేదు. అక్కడికక్కడే - విద్యుత్ సంస్థ ఛైర్మన్ కుట్టిని సంప్రదించి, గృహ వినియోగదారుల విషయంలో కొంత వెసులు బాటు

కొరవ 8వ పేజీలో

# బురదలో మందారం - పిల్లలపార్కు

చింతారెడ్డిపాళెం వంక అంటే టౌనం తటిక చిన్న చూపు. ఆ రోడ్డులోకి అడుగు పెట్టాలంటేనే చీదర. ఇరుకు రోడ్డు; రెండు ప్రక్కలా కంపు; వానవస్తే చీకిపోయిన చెత్త బురదలాగా మారి రోడ్డంతా పరచుకోవడం... మనకు తెలిసిన చింతారెడ్డిపాళెం వంక అది - కానీ ఇప్పుడా రోడ్డులోకి అడుగుపెడితే దిమ్మ తిరిగి పోతున్నది. మనం నెల్లూరులోనే వున్నామా లేక ఏ మహానగరంలో విహరిస్తున్నామా అన్న సందేహం కలుగుతుంది. సిమెంట్ రోడ్డు, తీర్చిదిద్దిన డివైడర్లు, ఫ్లోరసెంట్ విద్యుద్దీపాలు... అద్భో కలల ప్రపంచం సృష్టించారు. రోడ్డుదాటి చిల్డ్రన్స్ పార్కులోకి అడుగు పెడితే మతిపోతుంది.

నెల్లూరు వంటి చిన్న టౌన్‌లో ఇంత బ్రహ్మాండమైన పార్కు నిర్మించడం నమ్మలేని నిజం. జిల్లా కలెక్టర్ వై.శ్రీలక్ష్మి కళాతృష్ణకు ప్రతిరూపంగా రూపుదిద్దుకున్నదది. కలెక్టర్లు అంటే - రైలు పెట్టెలో ప్రయాణికుల వంటివారు. అందులో వున్నంత సేపే వారికి రైలుతో అనుబంధం; స్టేషన్‌లో దిగిన తర్వాత రైలు దారి రైలుది; ప్రయాణికుల దారి ప్రయాణికులది! కలెక్టర్‌గా బదలీ అయివెళ్లిపోయిన తర్వాత తిరిగి ఆ జిల్లాకు తమ ముఖం చూపించే అధికారులు అరుదు. శ్రీలక్ష్మి గారి పరిస్థితి అంతే. అయినా ఆమె నెల్లూరు తన స్వంత వూరుగా భావిస్తున్నదా అన్పిస్తుంది - ఈ పార్కు చూస్తుంటే. తను బదలీపై వెళ్లినా నెల్లూరీయులు తమ పేరు చిరకాలం గుర్తుంచుకునేలా చేశారామె.

సాయంత్రం ఒక గంట చల్లగాలి పీల్చుకునేందుకు చిన్న పార్కు సైతంలేని జనారణ్యం నెల్లూరు. మునిసిపాలిటీ అశ్రద్ధ, అసమర్థతల వల్ల ఉన్న పార్కులన్నీ పాడుబడి పోయాయి. అక్రమ కట్టడాలతో అదృశ్యమై పోయాయి. చిల్డ్రన్స్ పార్కుతో ఆ కరవు తీరిపోయింది. అందులోలేని సౌకర్యం లేదు. మూడు ఫౌంటెన్లు, ఒక స్కేటింగ్ రింగ్, స్విమ్మింగ్ పూల్, ఇండోర్ గేమ్స్, జాగింగ్ ట్రాక్, పచ్చటి లాన్లు, విద్యుద్దీపాల కాంతులు, క్యాంటిన్ వంటి సర్వ సౌకర్యాలతో సుందరవనంగా తయారైందిది. డబ్బుకు తడుముకోకుండా, వెనుకా ముందు చూడకుండా వెదజల్లినందువల్లే ఇంత త్వరితంగా సర్వ సౌకర్య విలసితంగా తయారైంది. నెల్లూరులోనే కాదు - మద్రాసు వంటి నగరంలోనూ ఇన్ని సౌకర్యాలు ఒకేచోట కల్గిన పురపార్కు లేదు. నెల్లూరుకు ఒక శాశ్వత పౌరసౌకర్యం కల్పించిన కలెక్టర్‌ను అభినందించాలి.

## సంకల్ప బలం శ్రీలక్ష్మిది - శ్రమఫలం జె.ఎస్.ది !

ఈ పార్కు నిర్మాణం ఉత్సాహంగా ప్రారంభమై ఉల్లాసంగా ముగిసినా - మధ్యలో ఎంతో పెద్ద రాజకీయ వివాదాలు, ఎన్నో అలజడులు; పేరు కోసం వీధులకెక్కారు - కోర్టు గడపా తొక్కారు. ప్రారంభోత్సవానికి ఒక నణుగుడు; టూరిజం శాఖకు నిర్వహణ బాధ్యత అప్పగించడంపై మరొక గొణుగుడు. ఈ గలభాలన్నింటినీ ప్రత్యక్షంగా తానే ఎదుర్కొన్నారు - కలెక్టర్ గారు. అదేదో తన స్వంత ఆస్తి అయినట్లు ప్రాకులాడారామె.

ఈ పార్కు నిర్మాణంలో సంకల్పబలం కలెక్టర్‌ది అయితే - శ్రమఫలం జెఎస్ రెడ్డిది. జెఎస్ రెడ్డిది విచిత్ర వ్యక్తిత్వం. పదిమందిలోకి రాడు. ప్రచారానికి ప్రాకులాడాడు. కాని పది మందికి పనికి వచ్చే పని అంటే మాత్రం అందరికంటే ముందు వుంటాడు. నెల్లూరులో బ్లడ్ బ్యాంక్ నిర్మాణానికి పది లక్షలు ఇచ్చినా, క్యాన్సర్ చికిత్సా కేంద్రానికి మరొక పది లక్షలు సమర్పించినా రెండవ కంటికి తెలియదు. అంత గుంభనం మనిషి. జన్మభూమి క్రింద పార్కు నిర్మాణం తలపెట్టి నప్పుడు - ఆ భారం మోసే బోయి ఎవరూ దొరకలేదు. కలెక్టర్ గారు తెలివిగా ఆ పల్లకివి జెఎస్.రెడ్డి భుజం మీద మోపారు. దొరకునా ఇటువంటి సేవ అనుకొంటూ చివరి వరకు ప్రాకులాడాడు. పెంట కుప్పలు ఎత్తే దగ్గర నుంచి, పార్కులో పచ్చ గడ్డి పిలకలు నాటే వరకు ప్రతి పనీ దగ్గరుండి జరిపించాడు. ఆట వస్తువులు, కొనుగోలు, స్కేటింగ్ రింగుల నిర్మాణం వగైరాల కోసం ఎక్కడెక్కడో తిరిగాడు. కలెక్టర్ బిల్లులు ఇవ్వడం ఆలస్యం చేస్తే తన డబ్బే అడ్వాన్సు చేశాడు. అనుకున్న దానికంటే అందంగా తీర్చి దిద్దాడు.

ఇంత చేసి - కనీసం ఆ పార్కుకు తన పేరు పెట్టమనీ అడగలేదు; ఎప్పుడూ కనీసం ఒక పత్రికా ప్రకటనలోనూ తన శ్రమ గురించి చెప్పుకోలేదు. అంత నిస్వార్థంగా ప్రజా సంస్థల కోసం పనిచేసే వ్యక్తులు చాలా అరుదు. జె.ఎస్. రెడ్డిది తెరవెనుక కష్టం; జనం స్మృతి పథంలో మిగిలే ఉదారత్వం. ఈ పార్కు కోసం ఆయన ఖర్చుపెట్టిన స్వంత డబ్బు 55 లక్షలని కలెక్టర్ గారు చెప్పారు. అంత డబ్బు ఖర్చు పెట్టిన జెఎస్. రెడ్డి శ్రమ, దానం వృథా కాకుండా సముచిత రీతిలో శాశ్వత గుర్తు వుండే ఏర్పాటు చేయడం న్యాయం. జెఎస్.రెడ్డి కోరితే పార్కుకు ఆయన పేరు పెట్టడం ధర్మం.

***

8తేది సాయంత్రం పార్కు ప్రారంభోత్సవం ఆహ్లాదకరంగా జరిగింది. ఇళ్లమంత్రి ఆదాల ప్రభాకరరెడ్డి రిబ్బను కత్తిరించారు. జిల్లాలోని ఎమ్మెల్యేలందర్నీ పిలిచారు. అందరూ పోటీలుపడి కలెక్టర్‌ను పొగడ్తలతో ముంచెత్తారు. గతంలో పార్కుకు ఏసి సుబ్బారెడ్డి పేరు పెట్టనందుకు నిరసనగా ఉద్యమం నడిపి, అలజడి సృష్టించిన ఆనం వివేకానందరెడ్డి కూడా అందరితోపాటు శ్రీలక్ష్మి స్తోత్ర పారాయణం చేయడం - మీరు వేషం అనుకొంటే వేషమే! *



# సణుగుడు

## ◆ పోలీసులకు చీమకుట్టినట్లు కూడా లేదు !

జిల్లాలో పోలీసు యంత్రాంగం నిర్వహిస్తున్న మనీ సర్క్యులేషన్ మోసంపై గతవారం అంత కఠినంగా వ్యాఖ్యానించినా పోలీసు అధికారులకు చీమకుట్టినట్లు కూడా లేదు. యథాప్రకారం తమ దోపిడీని కొనసాగిస్తున్నారు. పైపెచ్చు ఇది చాలా మంచి పథకమని ఆ దగాకోరు కంపెనీ తరపున ప్రెస్ కాన్ఫరెన్స్ పెట్టించి మరీ చెప్పించారు.

ఈ కంపెనీ పేరు - ఇండియన్ గ్రీన్ గ్లోరి సర్వీసెస్ ప్రైవేట్ లిమిటెడ్, వీరి కార్యాలయం బెంగుళూరు. ఈ దగా పథకానికి వీరు చేసిన నామకరణం - గ్రీన్ గోల్డ్ గిఫ్ట్స్కీం! ఎంత అందమైన పేరో చూడండి! జమీన్‌రైతు విమర్శకు తమంతట తాము సమాధానం చెప్పలేక - ఆ కంపెనీ ప్రతినిధులనే పేరుతో ఒక నలుగురిని కూడేసి ప్రెస్ కాన్ఫరెన్స్ పెట్టించారు. కంపెనీ దండే 11వేల సొమ్మును గిఫ్టుల రూపంలో సభ్యులకే పంచుతారని; ఒక్కొక్క సభ్యుడు 6 రౌండ్లు ఈ పథకం నడిపితే కోటి 96లక్షలా 91వేల రూపాయల బహుమతి ఇస్తారని, ఇందులో దగాలేదు, మోసం లేదని ఆ ప్రతినిధులు చెప్పారు.

పోలీసులు పలికించిన చిలక పలుకులివి; ఏ కంపెనీ ప్రతినిధి అయినా తమ కంపెనీ దగాకోరుదని చెప్తాడా? ఈ ప్రెస్ కాన్ఫరెన్స్‌తో ఒక్క మేలు మాత్రం జరిగింది; జిల్లాలో ఈ మనీ చైన్ పథకం నిర్విఘ్నంగా కొనసాగుతున్నదని వీరు ధృవపరిచారు.

కంపెనీ చెప్పేది - తమ సభ్యత్వాలన్నీ స్వచ్ఛందంగా జరుగుతున్నాయని! కాని అది అబద్ధం, పోలీసులు, రెవిన్యూ అధికారులు, ఎక్సైజ్ ఇన్స్‌పెక్టర్లు జనం మీదపడి, దౌర్జన్యం చేసి, బెదరించి మరీ ఈ పథకాన్ని జరిపిస్తున్నారన్నది ఎవరూ కాదనలేని నిజం. అది బహిరంగమై తమ శాఖ పరువు, తన మానం మురుగు గుంటల్లో కలిసిపోయిన తర్వాత అయినా ఎస్పిగారు ఈ దోపిడీని నిల్పివుంటే సంతోషించి వుండేవారం; కాని ఆయనింకా ఆ పథకాన్ని సమర్థించడానికి తన అధికార జులుం ప్రదర్శించడం చూస్తుంటే - పోలీసు వ్యవస్థ పట్లనే జుగుప్స కలుగుతున్నది.

ఇప్పుడు కొత్తగా కావలి ఆర్డీఓ లక్ష్మికాంతం గారు ఈ దగాకోరులతో చేతులు

### డోలేంద్ర

కలిపారట. చౌకడిపో డీలర్లు, వీఏఓలను పీడించి, బెదరించి మరీ 11వేలు లెక్కన దండుతున్నారట. కలెక్టర్ గారూ - ఆ ప్రబుద్ధుడికి బడితపూజ చేయించలేరా?

***

తమ బదలీలపై పిటిషన్లు ఇచ్చుకోవడానికి బంగళాకు వచ్చిన కానిస్టేబుళ్లను లాఠీలతో కొట్టి తరిమాడట - ఎస్పి గారు మొన్నొక రోజు! నా మీద పత్రికలకు వార్తలందించి మళ్లీ ఏ ముఖం పెట్టుకొని వచ్చారని ఆగ్రహం వ్యక్తం చేశారట - ఆయన.

కానిస్టేబుళ్లకు అంత అలుసు ఎట్లా వచ్చింది? బదలీలకు, చేసిన బదలీల రద్దుకు ఎస్పి బంగళాలో పబ్లిక్‌గా బేరసారాలు జరగడం వల్లనే ఈ అలుసన్నది నిజం; అంతకు దిగజారడం తప్పు కాని, అది పత్రికల్లో వార్త కావడం నేరం ఎట్లా అవుతుంది? *

# ప్రజలది అరణ్యరోదనేనా?

కరెంట్ ధరల పెంపకం విషయంలో ముఖ్యమంత్రి తన మొండి పట్టు వీడకపోవడం విచారకరం. కరెంట్ ఛార్జీలు అపరిమితమైతే బ్రతకడం దుర్లభమని యావత్ ఆంధ్ర ప్రజానీకం ఘోషిస్తున్నది. రైతులు, సన్నకారు జనం, మధ్యతరగతి కుటుంబీకులు, వ్యాపారులు, చిన్న పరిశ్రమల నిర్వాహకులు... వారు, వీరనే తేడాలేకుండా అన్ని వర్గాల ప్రజలూ కరెంట్ ఛార్జీల పెంపుపట్ల ఆవేదన చెందుతున్నారు. విద్యుత్ జన జీవితానికి నిత్యావసరమై పోయింది. బియ్యం, నీరు, వస్త్రాల సరసన చేరిపోయింది విద్యుత్. కరెంట్ దీపం, ఫ్యానులేని ఇంట్లో బ్రతకడం అసాధ్యం. కూలీ పనిచేసుకొని బ్రతికే వాడికైనా సరే - అవి తప్పనిసరి. కాని ఇప్పుడు దీపం వెలిగించు కోవడం అంటే, రూపాయి కాగితాలు తగుల బెట్టడంతో సమానం. ఇరుగు పొరుగు రాష్ట్రాలలోనే కాదు - యావత్ ప్రపంచంలోనే కరెంట్‌కు ఇంత ధర ఎక్కడా లేదు. చంద్రబాబు నిత్యం కలవరించే అమెరికా, జపాన్, కొరియా వంటి దేశాలూ ఇంతింత భారం మోపడం లేదు. అమెరికాలో యూనిట్ కరెంట్ ధర ఇళ్ల వాడకానికి కేవలం ఐదు సెంట్లు; అంటే ఇప్పటి డాలర్ విలువలో రెండున్నర రూపాయలలోపు! కాని మనం ఐదున్నర రూపాయలు చెల్లించవలసి వస్తున్నది.

ప్రతిపక్షాలే కాదు - రాజకీయాలతో సంబంధం లేని నార్ల తాతా రావు వంటి విద్యుత్ రంగ నిపుణులు సైతం ఇంత అధికంగా రేట్లు నిర్ణయించడం అన్యాయమని ప్రకటిస్తున్నా చంద్రబాబులో మార్పు రావడం లేదు. ఆయన ఎందుకంత మొండిగా, మూర్ఖంగా వ్యవహరిస్తున్నాడో అర్థం కావడం లేదు. చంద్రబాబు దూరదృష్టి కలిగిన నేత అని; కష్టపడి పనిచేసే ముఖ్యమంత్రి అని; సక్రమ ప్రణాళికలతో, పథకాలతో ప్రజలకు మేలు చేస్తాడని నమ్మి ఆయనకు ఓటు వేశారు ఆంధ్రులు. కాని అదే నాయుడు ఇప్పుడు ఇట్లా తమ జేబులుకొట్టె వాడుగా మారిపోవడం భరించలేక పోతున్నారు.

భవిష్యత్ మేలు దృష్ట్యా కొన్ని కఠిన నిర్ణయాలు తీసుకోక తప్పదని చంద్రబాబు చెప్తున్న మాటలు అర్థరహితాలు. ఇప్పుడు పళ్లు రాలగొడతాను, ఆ తర్వాత బంగారు తాపడం చేసిన కట్టుడు పళ్లు కట్టిస్తాను అన్నట్లుంది - ఆయన వాదన.

కరెంట్ ధరల పెంపకం కఠినమైన నిర్ణయం ఎట్లా అవుతుంది. ప్రభుత్వం తన నిధులలో నుంచి ఖర్చు పెట్టి ప్రజలకు సబ్సిడీలు ఇచ్చే పథకాలలో కోత పెడితే - అది కఠిన నిర్ణయం. సబ్సిడీ బియ్యం ధరను రెండు నుంచి మూడున్నరకు; ఇప్పుడు ఐదున్నరకు పెంచడం ఆ కోవలోకి వస్తుంది. కాని కరెంట్ అట్లా కాదు. కరెంట్ ఉత్పత్తి ఖర్చు - హైడల్ ప్రాజెక్టులలో కేవలం 14 పైసలు; థర్మల్ కేంద్రాలు రూపాయిన్నర ధరకు అందిస్తున్నాయి. ప్రైవేటు సంస్థలూ రెండున్నర లోపునే అమ్ముతున్నాయి. మన విద్యుత్ ఉత్పత్తిలో హైడల్ కేంద్రాలది 50శాతం; థర్మల్ 40 శాతం; ప్రైవేట్ 10శాతం. వీటన్నింటినీ సరాసరి చేస్తే కేవలం రూపాయి ధరకు కరెంట్ ఉత్పత్తి అవుతున్నది. దాన్ని ఐదు రూపాయలకు అమ్మడం - ప్రభుత్వ ఉదారత్వం ఎట్లా అవుతుంది?

కరెంట్ పద్దులో ప్రభుత్వ నిధులు ఖర్చు పెట్టవలసి వస్తున్నదంటే - అందుకు కారణం ఉత్పత్తి వ్యయం, జీతభత్యాలు పెరగడం కాదు; అసమర్థత, అవినీతి మితిమీరడం. హైదరాబాదు నగరంలోనే సబ్‌స్టేషన్‌ల నుంచి విడుదలయ్యే ప్రతి వంద యూనిట్‌ల విద్యుత్‌కు కేవలం 40 యూనిట్‌లకు మాత్రమే డబ్బు తిరిగి వస్తున్నదట. తతిమా 60 యూనిట్లు, లైన్ లాస్‌ల రూపంలోనో, చోరీ రూపంలోనో నష్టపోతున్నారు. రైతులకు చవకగా విద్యుత్ ఇవ్వడం వల్లే విద్యుత్ బోర్డు నష్టాలకు గురౌతున్నదని పదే పదే మాట్లాడడం ముఖ్యమంత్రికి అలవాటు. కాని హైదరాబాదు సిటీలో ఒక్క వ్యవసాయ కనెక్షన్ సైతం లేదు. అయినా 60శాతం నష్టం తప్పడం లేదు.

లైన్‌లాస్‌లు 10శాతం వరకు వుండడం సహించదగిన సాంకేతిక లోపం. అమెరికా వంటి దేశాలలో ఇది ఐదుర శాతం మించదు. కాని ఆంధ్రరాష్ట్రంలో 38శాతం లైన్ లాస్ వుందని ప్రభుత్వమే ప్రకటించింది. ఎంత సిగ్గుచేటు? కనీసం 20శాతం విద్యుత్ చోరీ అవుతున్నారని అంచనా! వీటి రెండింటి విషయంలో ప్రజలకు ఏ మాత్రం బాధ్యత లేదు. ప్రభుత్వం నిజంగా కఠిన నిర్ణయాలు తీసుకోదలిస్తే - కరెంట్ దొంగలను పట్టుకోవాలి; లైన్ లాస్‌కు కారణభూతమౌతున్న అధికారుల అవినీతిని అరికట్టాలి. చవకబారు తీగలు, ట్రాన్స్‌ఫార్మర్‌లు వాడడం వల్లే లైన్ లాస్, ఓల్టేజి లోపం సంభవిస్తున్నాయి. కఠిన నిర్ణయం అంటే - ఈ అవినీతిని అరికట్టి, లైన్లలో కరంట్ సరఫరాను మెరుగు పరచడం.

జమీన్‌రైతు

ప్రభుత్వ పరంగా జరిగే లోపాల వల్ల వచ్చే నష్టాలను ప్రజలను పిల్చి పిప్పి చేసి పూడ్చుకోవాలను కోవడం దుర్మార్గం. అది ప్రజాపీడన అన్పించుకొంటుంది తప్ప, ప్రజాపాలన కానేకాదు. ఒక్కశాతం లైన్ నష్టం తగ్గించుకోగలిగితే ఏడాదికి 160కోట్లు ఆదా అవుతుందని విద్యుత్ మంత్రి ప్రకటించారు. 38శాతం నష్టం అంటే - 6080 కోట్ల రూపాయలు. ఇప్పుడు పెంచిన ధరల వల్ల 1050 కోట్ల రూపాయల అదనపు ఆదాయం వస్తుందని అంచనా. అంటే కేవలం 7శాతం లైన్ నష్టం తగ్గించుకోగలిగితే ఒక్క రూపాయి ధర పెంచకుండా అన్ని కోట్లు సమకూరుతాయి.

ఇతరత్రా రాబడి పెంచుకోగలిగిన మార్గం వుండి కూడా కేవలం ధరల పెంపకం ద్వారానే విద్యుత్ సంస్థను నడిపించాలనుకోవడం - ముఖ్యమంత్రి చేస్తున్న పొరపాటు. ఇది ప్రజా సంక్షేమం కోరేవారు చేయదగిన పనికాదు. రాష్ట్రంలో గత పదేళ్లుగా పారిశ్రామికాభివృద్ధి లేదు. కొత్త పరిశ్రమలు రాకపోగా, వున్నవి మూత పడుతున్నాయి. ఇంకొక ప్రక్క వ్యవసాయంలో ఖర్చులు పెరిగి, రాబడి తగ్గిపోతున్నది. 1990లో డీసల్ ధర 4 రూపాయలు; ఇప్పుడు 15 రూపాయలు, అంటే నాలుగురెట్ల పెరుగుదల! అప్పుడు కరెంట్ హార్స్ పవర్‌కు రు50లు; ఇప్పుడు 450; అంటే 9రెట్ల పెరుగుదల. కాని అప్పుడు వడ్లు పుట్టి రెండున్నరవేలు; ఇప్పుడు నాలుగువేలు. అంటే ఖర్చులు నాలుగు నుంచి తొమ్మిదిరెట్లు పెరిగితే, వడ్లు మాత్రం రెట్టింపు కాలేదు. ఈ పరిస్థితి వల్ల రైతుకు రాబడి క్షీణించింది. వ్యవసాయ, పారిశ్రామిక రంగాలు రెండూ అట్లా కుంటి నడకలు నడవడం ప్రజల నికరాదాయం, నిజరాబడి ఏ మాత్రం పెరగడం లేదు. ఈ వాస్తవం గ్రహించకుండా బియ్యం, కిరోసిన్, గ్యాస్, కరెంట్, డీసల్, ఎరువులు, మందులు వంటి ధరలన్నీ పెంచుకొంటూపోతే ప్రజలు అల్లాడి పోవలసి వస్తుంది; వారి జీవితం దుర్భరమౌతుంది. చంద్రబాబు నాయుడు ప్రజల ఆందోళనను అరణ్యరోదనగా భావించకుండా కరెంట్ ఛార్జీల పెంపు నిర్ణయం ఉపసంహరించుకోవాలి. ప్రజల మేలు కోరేవాడైతే తన మొండి పట్టు మానాలి!

* * *

---

జమీన్‌రైతు

9.6.50

వెల: 0-2-0 పేజీలు: 12

## నెల్లూరు ముచ్చట్లు పదకొండు స్థానాలు

కొత్త రాజ్యాంగం ప్రకారం నెల్లూరు జిల్లా 16,17,026 జన సంఖ్యకు శాసనసభ స్థానాలు 11 నిర్ణయించబడినవి. అనగా 1లక్ష 47వేల జనాభాను ఒక స్థానం వంతు నిర్ణయమైనట్లు అర్థం. ఇదిగాక హరిజనులకు 2స్థానాలు యేర్పరచిరి.

జిల్లాలో 13 తాలూకాలు, 11 స్థానాలు - రెండు తాలూకాలను ఇతర తాలూకాలతో కలిపి చేయవలసి యున్నది. అవి యేవిగా వుంటవో?

తాలూకా వారీ జనాభా

| | | |
|---|---|---|
| 1. | నెల్లూరు | 2,12,945 |
| 2. | కందుకూరు | 1,87,808 |
| 3. | కోవూరు | 1,61,312 |
| 4. | కనిగిరి | 1,49,752 |
| 5. | ఆత్మకూరు | 1,20,752 |
| 6. | కావలి | 1,18,951 |
| 7. | దర్శి | 1,13,062 |
| 8. | గూడూరు | 1,01,119 |
| 9. | ఉదయగిరి | 1,09,803 |
| 10. | సూళ్లూరుపేట | 91,302 |
| 11. | పొదిలి | 86,600 |
| 12. | రాపూరు | 82,400 |
| 13. | వెంకటగిరి | 81,120 |

తక్కువ జనాభాను కలిగినవి పొదిలి, సూళ్లూరుపేట, వెంకటగిరి, రాపూరు యివి నాలుగు మాత్రమే. ఇందులో ఉత్తరాదిన ఒక తాలూకా యున్ను, దక్షిణ ప్రాంతంలో 3 తాలూకాలున్ను వున్నవి. ఉత్తరాది పొదిలి తాలూకాను చుట్టుప్రక్కలున్న దర్శి, కనిగిరి, కందుకూరు వీటిలో దేనిలో కలిపినా జనాభా జాస్తి వుతుంది. దక్షిణ ప్రాంతం సూళ్లూరుపేట, వెంకటగిరి కలిపితే 1,72,422 అవుతుంది. కావున నివి రెండు ఒకటి చేస్తారని వూహించవచ్చు. మరొకటి గూడూరు, రాపూరు కలిపితే 1,83,619 అవుతున్నది రెండు స్థానాలు దక్షిణ ప్రాంతాన సర్దుబాటు చేయడం అక్రమంగా కనిపిస్తుంది. ఉత్తరాదిన దర్శి, పొదిలి. రెండూ కలిపితే 1,99,682 జనాభా అవుతుంది. కాపున గూడూరు, రాపూరు కలిపేదానికంటె పొదిలి దర్శి

తరువ 10వ పేజీలో

50 ఏళ్లక్రితం ఈ వారం

---

## జనవాణి

# 'బాబు' డంబాలకు పత్రికల 'డప్పు'

మే 26తేది నాటి జమీన్‌రైతు సంచికలో "కరవు కష్టాల నుంచి, పెరిగిన ధరల శాపాల నుంచి, ప్రజల దృష్టిని మళ్లించేందుకు ముఖ్యమంత్రి చంద్రబాబు నాయుడు, పత్రికలను అడ్డంపెట్టుకొని చేస్తున్న ఈ జలసంరక్షణ తిరునాళ్ల, అధికార యంత్రాంగానికి కాసుల వర్షం కురిపిస్తోంది" అని వ్రాయడం ఎంతో సముచితంగా వుంది. పత్రికల ప్రచారం మాటకు వస్తే చాలా బాధవేస్తున్నది. నాకు 60 సంవత్సరాల రాజకీయ అనుభవం వుంది. ఆనాడు హిట్లరు జర్మనీలో కూడా, హిట్లర్ తోపాటు, రిబ్బన్‌ట్రాప్, హిమ్లర్, హెర్మన్ హెస్, గోబెల్స్ తదితర నాజీ నాయకులకూ పత్రికలలో, రేడియోల్లో ప్రాముఖ్యత వుండేది.

వేములపాటి అనంతరామయ్య
(అడ్వకేట్)

### ఎన్టీఆర్ స్మారకంగా తపాలాబిళ్లా?

స్మారక తపాల బిళ్ల విడుదల చేయాల్సినంత గొప్పవాడు కాదు ఎన్టీరామారావు. దేశం కోసం, దేశ సంక్షేమం కోసం భరత మాత దాస్యశృంఖలాలను తప్పించడం కోసం తమ మాన, ధన, ప్రాణాలను సైతం త్యాగం చేసిన అమరజీవులెందరో స్టాంపుల పైకెక్కని వారున్నారు. అటువంటి త్యాగమయుల జీవితాలతో పోలిస్తే ఎన్టీఆర్ జీవితంలో నూరవ వంతు త్యాగంకూడా వుండదు. ఎన్టీఆర్ తెలుగు చలన చిత్ర పరిశ్రమ మరువలేని మహానటుడు మాత్రమే. అందుకుగాను ఆయనకు కళాకారుల కోటా క్రింద పద్మశ్రీ బిరుదునిచ్చి కేంద్ర ప్రభుత్వం ఏనాడో సత్కరించింది. లాలా లజపతిరాయ్, బాలగంగాధరతిలక్, బిపిన్ చంద్రపాల్, గోపాలక్రిష్ణ గోఖలే, టంగుటూరి ప్రకాశం పంతులు, దుగ్గిరాల గోపాలక్రిష్ణయ్య, భగత్‌సింగ్, శ్యామ్‌ప్రసాద్ ముఖర్జీ, దీనదయాళ్ ఉపాధ్యాయ, శంకర్ దయాళ్ శర్మ, జయప్రకాష్ నారాయణ, ఇందిరాగాంధీ వంటి త్యాగధనుల కోవలోకి ఎన్టీఆర్ వచ్చి నిలబడుతారా? వీరంతా అవినీతి అంటే ఏమిటో తెలియని పుణ్య మూర్తులు. కాని ఎన్టీరామారావు జీవితమే అవినీతిమయం. ఆదాయపు పన్ను చెల్లించ వలసి వస్తుందని కోట్లాది రూపాయల నల్లధనాన్ని లారీ కైకల్లో, బాత్‌రూం, కిచెన్ గోడల్లో దాచిపెట్టిన ప్రబుద్ధుడాయన. సినీ గ్లామర్‌తో అధికారంలోకి వచ్చి 6 సంవత్సరాలు ముఖ్యమంత్రిగా పనిచేసినంత మాత్రాన తపాలాబిళ్ల విడుదల చేయాల్నా? ఆయన పాలనలో 13 కేసుల్లో అవినీతికి పాల్పడ్డట్టు న్యాయస్థానం కూడా ధృవీకరించింది. తన జీవితాన్ని, సంపదను ప్రజల కోసం అంకితం చేసిన తమిళహీరో ఎమ్జీఆర్ పేరిట ఇటువంటి తపాలాబిళ్ల విడుదల చేయలేదే? ఇకనుంచైనా కేంద్ర ప్రభుత్వం తపాల బిళ్లలు ఎవరి పేరిటంటే వారి పేరిట విడుదల చేయక స్వాతంత్ర్య సమరయోధులకే పరిమితం చేయాలి.

నెల్లూరు వి.రవికుమార్

### బాలాజీనగర్‌లో దొంగతనాలు

బాలాజీనగర్‌లో ఇటీవల దొంగతనాలు ఎక్కువయ్యాయి. దొంగలకు పోలీసులంటె కూడా భయం లేకుండా పోయింది. ఈ మధ్య ఒక పోలీసు ఇంట్లో దొంగలు పడితే, ఆయన పరువుకు భయపడి ఫిర్యాదు చేసినట్లు లేదు. పట్ట తెలియకుండా తాగివచ్చిన తాగుబోతు భర్తపై అలిగి బయట పడుకున్న భార్యమెడలో [illegible] దొంగ. వారం రోజుల క్రితం ఒక నడివయస్కు రాలిని బలవంతం [illegible]

తరువ 10వ పేజీలో

# భారతావనిపై 'నారాయణ' పవనాలు

ఇంటర్, ఎంసెట్, ఐఐటి పరీక్షా ఫలితాల్లో మెరుగైన ర్యాంకులు సాధించిన నెల్లూరు నారాయణ కోచింగ్ సెంటర్ విద్యార్థులు ట్రిపుల్ ఐటిలోనూ గతంలో సంస్థ

## ట్రిపుల్ ఐ.టి.లో 43 ర్యాంకులు

నెలకొల్పిన రికార్డులను బద్దలు కొట్టారు. జాతీయ స్థాయిలో జరిగిన ఈ పరీక్షల్లో నారాయణ కోచింగ్ సెంటర్‌కు చెందిన విద్యార్థులు 43 మంది 500లోపు మెరుగైన ర్యాంకులు సాధించారు. వందలోపు 7 ర్యాంకులను ఇక్కడ కోచింగ్ తీసుకొన్న విద్యార్థులు సాధించడం విశేషం. ఇంటర్, ఇంజనీరింగ్, ఐఐటి, రూర్కీ ప్రవేశ పరీక్షల్లో తనకు తిరుగులేదని చాటిన నారాయణ కోచింగ్ సెంటర్ విద్యార్థిని మైథిలీ రంగనాథ్ ట్రిపుల్ ఐటిలోనూ 11వ ర్యాంకు సాధించింది. ఉపేందర్‌రెడ్డి (16), దీప్తినాగ్ (43), విజయ్‌నాయుడు (45), శ్రీధర్‌రెడ్డి (76), సిద్దార్థ (92)వ ర్యాంకులను సాధించారు. పోయిన యేడాది ట్రిపుల్ ఐటిలో మొదటి ర్యాంకర్ సిద్దార్థ నారాయణ కోచింగ్ సెంటర్

తరువాయి 11వ పేజీలో

# చట్టాలున్నా చట్టుబండలే

పర్యావరణ పరిరక్షణకు ఉద్దేశించి చట్టాలున్నా వాటి అమలులో చోటు చేసుకొంటున్న లోపాల వల్ల ఆశించిన స్థాయిలో ప్రగతి సాధించలేక పోతున్నట్లు జాయింట్ కలెక్టర్ దాసరి కార్మియేల్ చెప్పారు. 5తేదీ ప్రపంచ పర్యావరణ దినోత్సవం సందర్భంగా

## పర్యావరణంపై జె.సి. ఆవేదన

టౌన్‌హాల్‌లో ఆంధ్రప్రదేశ్ కాలుష్య నియంత్రణ బోర్డు నేతృత్వంలో జరిగిన సదస్సుకు ముఖ్య అతిథిగా విచ్చేసి మాట్లాడారు. మొక్కలు పెంచడం వల్ల కాలుష్యాన్ని బాగా తగ్గించుకోవచ్చు కాని వీటి పెంపకం పట్ల ప్రజలు ఆసక్తి కనపర్చడం లేదన్నారు. జిల్లా జడ్జి టి. అంజనేయులు మాట్లాడుతూ పర్యావరణానికి సంబంధించిన ఏడు చట్టాలు అమలులో వున్నాయని వీటిని పాటిస్తే పర్యావరణానికి ఎంతగానో మేలు చేకూరు తుందన్నారు. జిల్లా అటవీశాఖాధికారి పి. భాస్కరరెడ్డి, ఎ.పి. ప్రోత్సాహక కంట్రోల్ బోర్డు రీజనల్ మేనేజర్ ఎం.శివారెడ్డి ఈ సదస్సులో మాట్లాడారు.

## మహిళాభ్యుదయానికి తెలుగుదేశం అంకితం

తెలుగుదేశం ప్రభుత్వాన్ని నిలబెట్టింది మహిళలు, వారి అభ్యున్నతే ధ్యేయంగా ప్రభుత్వం పనిచేస్తుందని రాష్ట్ర స్త్రీ, శిశు సంక్షేమ శాఖామంత్రి సరస్వతి చెప్పారు. తన నెల్లూరు పర్యటన సందర్భంగా 3తేది సోమశిల అతిథి గృహంలో విలేఖరులతో మాట్లాడారు. సామాజిక, ఆర్థిక, ఆర్థికేతర అంశాలలో మహిళలను ముందుకు నడిపేందుకు ప్రభుత్వం చిత్త శుద్ధిగా

తరువాయి 11వ పేజీలో

# హక్కులకన్నా బాధ్యతలే మిన్న

ప్రభుత్వ, ప్రైవేటు రంగాల్లో పనిచేస్తున్న కార్మికుల్లో ఎక్కువ శాతం మంది తమ బాధ్యతలు విస్మరించి, హక్కుల కోసం పోరాటం చేస్తున్నట్లు ఎపిఎస్ ఆర్టీసి నెల్లూరు రీజియన్ మేనేజర్ ఎన్. ధర్మారెడ్డి అభిప్రాయపడ్డారు.

## నెల్లూరు సంగతులు

4తేదీ టౌన్‌హాల్‌లో జరిగిన భారతీయ మజ్దూర్ సంఘ్, 14వ జిల్లా మహాసభల్లో ముఖ్యఅతిథిగా విచ్చేసి మాట్లాడారు. హక్కులకన్నా బాధ్యతలు ముఖ్యం. ఇది గుర్తెరిగిన నాడు ఏ సంస్థ అయినా బ్రహ్మాండంగా నడుస్తుందన్నారు. జిల్లా బిజెపి అధ్యక్షుడు రంగోని కృష్ణయ్య మాట్లాడుతూ సొంత ఆర్జనే ధ్యేయంగా కొన్ని యూనియన్లు పనిచేస్తున్న ఈ రోజుల్లో బిఎంఎస్ కార్మిక శ్రేయస్సును దృష్టిలో పెట్టుకొని పోరాటం చేస్తుందన్నారు. బిఎంఎస్ రాష్ట్ర కార్యనిర్వాహక అధ్యక్షుడు ఆర్.ఎల్.ఎన్. రాజా మాట్లాడుతూ రాష్ట్రంలోని చంద్రబాబు నాయుడు ప్రభుత్వం కార్మిక సమస్యలనే పట్టించు కోవడం లేదని విమర్శించారు. బిజెపి జాతీయ కౌన్సిల్ సభ్యుడు ఆచార్య ఆదిత్య, బిఎంఎస్ నాయకులు వి. సాంబశివరావు, డి. ప్రసాదరావు, రాఘవయ్య, ఖాదర్‌బాషా సభలో మాట్లాడారు.

## ఛార్జీలు తగ్గించే వరకు ఉద్యమిద్దాం!

పెంచిన విద్యుత్ ఛార్జీలను వెంటనే

తరువాయి 11వ పేజీలో

ప్రజాపథంలో భాగమైన ప్రజాసన్నిధి కార్యక్రమంలో ప్రజల నుండి వినతిపత్రాలు స్వీకరిస్తున్న నెల్లూరు ఎమ్మెల్యే వివేకానందరెడ్డి. ప్రక్కన కార్పొరేటర్ పుట్టా రామకృష్ణారెడ్డి కూడా వున్నారు.

# గుడ్డిదీపాలతోనా స్వర్ణాంధ్ర సాధన?

చంద్రబాబు నాయుడు హైటెక్ పాలన పురాతన కాలంనాటి లాంతర్లు, గుడ్డి దీపాలు అభివృద్ధి చెందే అవకాశం విద్యుత్ ఛార్జీలు విపరీతంగా పెంచడం వల్ల ఏర్పడిందని నెల్లూరు ఎమ్మెల్యే ఆనం వివేకానందరెడ్డి వ్యాఖ్యానించారు. 4తేది విలేఖరులతో మాట్లాడుతూ రాష్ట్ర ప్రభుత్వం ప్రపంచ బ్యాంకుకు ఏటేటా 15శాతం విద్యుత్ ఛార్జీలు పెంచు తామని ఇచ్చిన హామిలో భాగంగానే వీటిని పెంచింది. పరిశ్రమలకు విద్యుత్ ఛార్జీలను పెంచకూడదని ప్రపంచ బ్యాంకు ఇచ్చిన సలహాతోనే చంద్రబాబు విద్యుత్ సరఫరాకు అయ్యే మొత్తం ఖర్చును గృహ వినియోగదారుల నెత్తిన మోపారు. జిల్లాలోని వినియోగదారులు పెంచిన విద్యుత్ ఛార్జీల వల్ల ప్రతి నెలా 4.5కోట్ల రూపాయల అదనపు భారం పడుతుందన్నారు. వినియోగదారుడు నూటికి నూరుశాతం అదనంగా విద్యుత్ ఛార్జీ చెల్లించాల్సి వస్తుంది. పెంచిన ఛార్జీలు 1800 కోట్ల రూపాయల అదనపు భారంలో 286కోట్ల రూపాయల తగ్గింపు సముద్రంలో నీటిబొట్టేనన్నారు. ఈ ప్రకటన పేద, మధ్య తరగతి ప్రజలను మోసగిచ్చేందుకే అన్నారు. 286 కోట్ల రూపాయలు తగ్గించిన మొత్తాన్ని

## వివేకా నిరసన

సబ్సిడిగా ప్రభుత్వమే ఇస్తుందంటూ, ఇప్పటికే బోర్డుకు 800 కోట్ల రూపాయల సబ్సిడి ఎగవేసి, ఛార్జీలు పెంచి మళ్లీ సబ్సిడీ ఇస్తామని చెప్పడం విడ్డూరంగా వుందన్నారు. రాష్ట్రంలోని పరిశ్రమలు, బాకీదారులు, మునిసిపాలిటిలు కలిపి 743 కోట్ల రూపాయలు విద్యుత్ శాఖకు బకాయి పడివున్నారు. వీటి మీద పదిశాతం రికవరీ కూడా లేదు. రెగ్యులేటరీ కమీషన్ బదులు రికవరీ కమీషన్ ఏర్పాటు చేస్తే బాగుంటుందని వివేకానందరెడ్డి ఎద్దేవా చేశారు. పెరిగిన విద్యుత్ ఛార్జీలతో వ్యవసాయం చేయడం కనాకష్టమని, పెంచిన విద్యుత్ ఛార్జీలు రద్దు చేసే వరకు కాంగ్రెస్ పార్టీ పోరాడుతుందన్నారు. దీనిలో భాగంగా 9తేది ధర్నా, 12తేది మహిళా కాంగ్రెస్ ఆధ్వర్యంలో నిరసన, 14తేదీ ప్రజా ప్రదర్శన నిర్వహిస్తామని వివేకానందరెడ్డి వివరించారు.

## మైనార్టీ కార్పొరేషన్ ఆఫీసులో వివేకా

తాను సృష్టించుకొన్న ప్రజాపథంలో భాగమైన పరిష్కార సాధన కార్యక్రమంలో ఎమ్మెల్యే ఆనం వివేకానందరెడ్డి 3తేది

తరువాయి 11వ పేజీలో

# పాతకేసులకు బూజు వదిలిద్దాం!

అనేక జిల్లాల్లో పేరుక పోయిన పెండింగ్ కేసుల పరిష్కారానికి న్యాయమూర్తులు జరుపుతున్న కృషికి న్యాయవాదులు సహకరించాలని జిల్లా జడ్జి టి. అంజనేయులు కోరారు. 5తేదీ బార్ అసోసియేషన్‌ను సందర్శించిన కొత్త జడ్జి న్యాయవాదులను వుద్దేశించి మాట్లాడారు. జిల్లాలో 1993 సంవత్సరానికి ముందు దాఖలైన కేసులు సైతం ఇంకా అపరిష్కృతంగా వున్నాయి. దీనివల్ల కక్షిదారులు తీవ్ర ఇబ్బందులు పడుతున్నారు. జిల్లాలో పెద్ద ఎత్తున లోక్ అదాలత్‌లు నిర్వహించి రాజీకి అనువైన సివిల్, క్రిమినల్, మోటారు ప్రమాదాల పరిష్కారం కేసులు పరిష్కరిద్దాం. జిల్లాలోని మారు మూల గ్రామాల్లో సైతం న్యాయ చైతన్య సదస్సులు నిర్వహిద్దామన్నారాయన. న్యాయవాదుల సమస్యలను తాను పరిష్కరిస్తానని జిల్లా జడ్జి ఈ సందర్భంగా హామి ఇచ్చారు. జడ్జి ప్రోత్సాహకరంగా మాట్లాడడంతో న్యాయవాదులు వుబ్బితబ్బిబ్బు లయ్యారు. ఈ కార్యక్రమంలో

## జిల్లా జడ్జి అంజనేయులు

మొదటి అదనపు జిల్లా న్యాయమూర్తులు జి. కృష్ణమోహన్‌రెడ్డి, దుర్గాప్రసాదరావు, సీనియర్ సివిల్ జడ్జి ఎం. వెంకటరమణ, బార్ అసోసియేషన్ అధ్యక్ష, కార్యదర్శులు వి.శేషాచలం, డి.హనుమంతరావు పాల్గొన్నారు.

## నెల్లూరు కవయిత్రికి రాష్ట్రస్థాయి అవార్డు

విజయవాడకు చెందిన ఎక్స్‌రే సంస్థ రాష్ట్ర స్థాయిలో నిర్వహించిన కవితల పోటీల్లో ప్రథమ బహుమతిని జిల్లాకు చెందిన కవయిత్రి పెరుగు సుజనారామం పొందారు. 21తేదీ విజయవాడ హోటల్ రాజ్‌టవర్స్ కాన్ఫరెన్స్ హాల్‌లో జరిగిన ప్రత్యేక కార్యక్రమంలో ఆంధ్రప్రభ వారపత్రిక సంపాదకుడు వల్లూరు రాఘవరావు ఈ అవార్డును సుజనారామంకు అందజేశారు. తెలుగు విశ్వ విద్యాలయం వైస్ ఛాన్సలర్ ఆచార్య గోపి ఈ పోటీలకు న్యాయనిర్ణేతగా వ్యవహరించారు.

# నెల్లూరు ముచ్చట్లు

విశ్లేషకుడు

## ఎస్పీ బదలీ?

జిల్లా ఎస్పీ సివి నరసయ్య బదలీ అవుతున్నట్లు తెలిసింది. వారం పదిరోజుల్లో బదలీ ఉత్తర్వు చేతికందవచ్చు. ఎస్పీ విశాఖపట్నంలో పోస్టింగ్ కోరుతున్నారు. నరసయ్యకు డిఐజీగా ప్రమోషన్ రావాల్సి వుండడంతో ఆయనకు పోస్టింగ్ ఇచ్చే స్థానం ఖచ్చితంగా తెలియరాలేదు. ముఖ్యమంత్రితో సన్నిహిత సంబంధాలు ఉన్న అధికారి కావడం వల్ల ఆయన కోరుకున్న చోటులోనే పోస్టింగ్ రావచ్చని చెబుతున్నారు.

## తప్పుల తడికగా మునిసిపల్ బడ్జెట్

నెల్లూరు మునిసిపల్ అధికారులు మరీ బరితెగించి పోయారు. బడ్జెట్‌ను తప్పుల తడికగా తయారుచేసి 7తేది జరిగిన సమావేశంలో ప్రవేశపెట్టారు. అధికారులతో తమకుండే కాంట్రాక్టు బిల్లుల లాలూచీతోనూ కౌన్సిలర్లు ఈ బడ్జెట్‌పై నామమాత్రంగా చర్చ జరిపి ఆమోదించారు. ఇది దండగ మారిన బడ్జెట్. పరిపాలనా సంబంధమైన వ్యవహారాల కోసం పద్ధతి ప్రకారం బడ్జెట్ ప్రవేశపెట్టాలన్న ధ్యేయంతో తూతూ మంత్రంగా దీన్ని తయారు చేశారు. బడ్జెట్‌తో సంబంధం లేకుండానే కౌన్సిల్‌లో కోట్ల రూపాయల నిధుల వ్యయం, పనుల అప్పగింత జరిగిపోయింది. అందువల్ల బడ్జెట్ కేవలం ఉత్త దండగ. అధికారులు 1.43 కోట్లు బ్యాంకులో బ్యాలెన్స్ వున్నట్లు బడ్జెట్ కాగితాల్లో చూపారు. కాని వాస్తవానికి బ్యాంకులో నాలుగు లక్షల రూపాయలు మాత్రమే వున్నాయి. 1999-2000 బడ్జెట్‌లో ఆస్తి పన్ను 3.60 కోట్లుగా చూపి, ప్రస్తుతం వచ్చిన కాపీలో 4.60కోట్లు వచ్చినట్లుగా చూపారు. కరవు నిధులు 7.26లక్షలు ఏ లెక్కలోనూ చూపలేదు. స్టాంప్ డ్యూటీ గత ఏడాది 3,91,46,217 రూపాయలొస్తే, ఈ యేడాది 4లక్షలే వసూలవుతాయని లెక్కల్లో పేర్కొన్నారు. ప్రకటనల పన్ను గత ఏడాది కన్నా పదింతలు ఎక్కువ వస్తాయని అధికారులు అంచనాలు రూపొందించారు. ఎస్.ఎస్.డి.పి గ్రాంటు క్రింద విడుదలైన కోటి 16లక్షల ఊసు బడ్జెట్‌లో లేనేలేదు. కాని చివరకు 38కోట్ల 65లక్షల 6వేల ఎనిమిది వందల అరవై ఎనిమిది రూపాయల ఆదాయాన్ని, 37కోట్ల 79లక్షల 40వేల ఐదువందల ముప్పై ఐదు రూపాయల వ్యయ అంచనా - 85,66,331 రూపాయల మిగులుగా గల బడ్జెట్‌ను సభ ఆమోదించింది. బడ్జెట్ సమావేశంలో మునిసిపల్ ఛైర్మన్ తాళ్లపాక అనూరాధ నోరు మెదపకుండా కూర్చోవడం విశేషం.

## నెల్లూరు ఎమ్మార్వో బదలీ

నెల్లూరు ఎమ్మార్వో వి. రామిరెడ్డిని జిల్లా కలెక్టర్ శ్రీలక్ష్మి ఎట్టకేలకు బదలీ చేశారు. ఆయన్ను కావలి ఎమ్మార్వోగా మార్చి, అక్కడ పనిచేస్తుండిన సి.హెచ్. పెంచలరెడ్డిని ఇక్కడ నియమించారు.

## జి.ప. సిఇఓ పదవీ విరమణ

జిల్లా పరిషత్ ముఖ్య కార్యనిర్వహణాధికారి ఎం. దామోదరం మే31 తేది పదవీ విరమణ చేశారు. దామోదరం పదవీ బాధ్యతలు స్వీకరించి మొదట్లు జిపిలో అవినీతి ద్వారాలు తెరిచారు. ప్రతి పనికి నంబరొకటని నిర్ణయించి పదవీ విరమణ వరకూ ఆ మార్గాన పయనించి సంతృప్తిగా పదవీ విరమణ చేశారు. జిల్లా వున్నతాధికారులు కూడా ఆయన పని తీరును చూసి మురిసిపోయారు. కారణం ఏమై వుంటుందబ్బా?

## పూడ్చిన కోనేర్లు తిరిగి త్రవ్వించగలరా?

జిల్లాలో చెరువుల పూడిక తీతపట్ల జిల్లా కలెక్టర్ శ్రీలక్ష్మి అత్యుత్సాహం ప్రదర్శిస్తున్నారు. ఇళ్లలో త్రవ్వుతున్న ఇంకుడు గుంటల ప్రారంభోత్సవానికి మంత్రులు సైతం వాపోతున్నారు. కావలిలో పూడిపోయిన కోనేరు నొకదాన్ని 20శాఖల అధికారులు తమ సొంత డబ్బు వెచ్చించి పూడిక తీయిస్తున్నారు. అటువంటిది నెల్లూరు టౌన్‌లో ఏళ్లతరబడిగా వున్న కోనేర్లను పూడ్చివేయడం వల్ల వీటి చుట్టు ప్రక్కల ప్రాంతాల్లోని బావులు, బోర్లలో ఈ యేడాది నీరింకిపోయాయి. మద్రాస్ బస్టాండ్ వద్ద గల కోనేరును లక్షలాది రూపాయలు ఖర్చుపెట్టి, కలెక్టర్ శ్రీలక్ష్మి పట్టుబట్టి పూడ్పించడంతో పరిసర ప్రాంతాలైన వహాబ్‌పేట, ముత్యాలపాళెం ప్రాంతాల్లోని బావులు, బోర్లలో ఈ యేడాది చుక్క నీరు లేకుండా ఎండిపోయాయి. దర్గామిట్ట ఎంజి బ్రదర్స్ ఎదురు వీధిలో గల కోనేరు ఆలనాపాలనా పట్టించుకొనే వారు లేకపోవడంతో ఇది పూడిపోయింది. జల సంరక్షణ ఉద్యమంలో సైతం ఈ కోనేరు గూర్చి జిల్లా అధికార్లు ఆలోచించక పోవడం బాధాకరం. చెరువుల పూడికతీత, కొత్త ఇంకుడు గుంటలు త్రవ్వే అధికారగణానికి టౌన్‌లోని ఈ కోనేర్లు కనపడలేదా? మద్రాస్ బస్టాండ్ కోనేరు తిరిగి త్రవ్విస్తే సంతోషమే; ఎం.జి. బ్రదర్స్ ఎదురు వీధిలో వున్న కోనేరులో మాత్రం అధికారులు అనుకొంటే జలకళ కానవస్తుంది.

## అన్నమాచార్యుల జయంతి

తిరుమల తిరుపతి దేవస్థానం, తిరుపతి అన్నమాచార్య ప్రాజెక్ట్ సంయుక్త యాజమాన్యాన తాళ్లపాక అన్నమాచార్యుల 592 జయంతి మహోత్సవం 10, 11తేదుల్లో టౌన్‌హాల్‌లో జరుగుతుంది. ఈ సందర్భంగా 10తేది సప్తగిరి సంకీర్తనల గోష్ఠిగానం, 11తేది తెనాలి వారిచే అన్నమయ్య నృత్య ప్రదర్శన కార్యక్రమాలు ఏర్పాటయ్యాయి. సంగీత ప్రియులను తీరిక చేసుకొని ఈ కార్యక్రమాలకు రమ్మంటున్నారు అన్నమాచార్య ప్రాజెక్ట్ డైరెక్టర్ డాక్టర్ మేడసాని మోహన్.

## బొల్లినేని ఆస్పత్రిలో ఉచిత వైద్య సేవలు

నెల్లూరు దర్గామిట్టలోని బొల్లినేని సూపర్ స్పెషాలిటీ ఆసుపత్రిలో ఈ నెల 9తేది నుంచి 16తేది వరకు గైనకాలజీ, ఇన్‌ఫెర్టిలిటీ, డెంటల్ విభాగంలోని డాక్టర్లు ఉచితవైద్య సేవలందిస్తారు. డాక్టర్ రజనీ గర్భిణీ స్త్రీలకు, పిల్లలు లేని దంపతులను, డాక్టర్ ప్రత్యూష ప్రసాద్ దంత సంబంధ వ్యాధిగ్రస్తులను వుచితంగా చూస్తారని, ఈ అవకాశాన్ని ప్రజలు ఉపయోగించుకోవాలని హాస్పిటల్ అడ్మినిస్ట్రేటర్ కోరుతున్నారు.

## కొత్త మునిసిపల్ ఇంజనీర్

నెల్లూరు మునిసిపల్ ఇంజనీర్ ఇమాముద్దీన్‌ను ప్రమోషన్‌పై ఒంగోలు పబ్లిక్ హెల్త్ ఎగ్జిక్యూటివ్ ఇంజనీర్‌గా నియమించారు. తిరుపతి మునిసిపాలిటీలో డిప్యూటీ ఇంజనీర్‌గా పనిచేస్తున్న రామమోహనరెడ్డి ప్రమోషన్ ద్వారా నెల్లూరులో ఛార్జి తీసుకోనున్నారు. ఇమాముద్దీన్ నెల్లూరులో కొంత కాలం చురుకుగా పనిచేసినా ఆ తర్వాత మామూలు ఇంజనీర్ అయిపోయారు.

## నెల్లూరు ఎమ్పీ న్యూయార్క్ యాత్ర

నెల్లూరు ఎమ్పీ డాక్టర్ ఉక్కాల రాజేశ్వరమ్మ కేంద్ర మానవ వనరుల అభివృద్ధి అధ్యయన కమిటీ సభ్యురాలి హోదాలో జూన్ 4తేది న్యూయార్క్ బయలుదేరి వెళ్లారు. వారం పదిరోజుల పాటు న్యూయార్క్‌లో వుంటారామె.

## సీనియర్ సిటిజన్స్ ఫెడరేషన్ కార్యవర్గం

ఫెడరేషన్ ఆఫ్ నెల్లూరు సీనియర్ సిటిజన్స్ కౌన్సిల్ సర్వ సభ్య సమావేశం ఇటీవల నెల్లూరులో జరిగింది. ఈ సందర్భంగా జరిగిన కార్యవర్గ ఎన్నికల్లో గౌరవాధ్యక్షునిగా కె.విశ్వబ్రహ్మాచారి, అధ్యక్షునిగా ఏ. జితేంద్రనాథ్ బాబు, అసోసియేట్ అధ్యక్షునిగా సి. వెంకట సుబ్బయ్య, ఉపాధ్యక్షునిగా సి. సత్యనారాయణమూర్తి, కార్యదర్శిగా డి. సుబ్బారావు, సహకార్యదర్శిగా టి. పార్థసారధి, కోశాధికారిగా టి. విద్యాసాగర్‌లను ఎన్నుకొన్నారు.

## జిల్లాపోలీసు అధికారుల సంఘం కార్యదర్శి

జిల్లా పోలీసు అధికారుల సంఘం కార్యదర్శిగా నందుకూరుపేట ఎస్ఐ విక్రమ శ్రీనివాసరావును ఎన్నుకొన్నారు. గతంలో జిల్లా కార్యదర్శిగా పనిచేసిన విజయభాస్కరరెడ్డి రాష్ట్ర కార్యదర్శిగా ఎన్నిక కావడంతో ఆయన స్థానంలో విక్రమ శ్రీనివాసరావును ఎన్నుకొన్నారు.

## కాంగ్రెస్ ధర్నాలో విధ్వంసం!

పెంచిన విద్యుత్ ఛార్జీలను నిరసిస్తూ కాంగ్రెస్ పార్టీ ఆధ్వర్యంలో విద్యుత్ భవన్ వద్ద 9తేది ధర్నా జరిగింది. ఈ సందర్భంగా ఆవేశపరులైన కాంగ్రెస్ కార్యకర్తలు విద్యుత్ భవన్ ప్రాంగణంలోని పబ్లిక్ రిలేషన్ అధికారి కార్యాలయాన్ని ధ్వంసం చేశారు. అక్కడ పనిచేసే ఉద్యోగులందరినీ బయటకు పంపివేసి కార్యాలయం ఎదుట బైఠాయించారు. ఈ సందర్భంగా, మహిళా కాంగ్రెస్ కార్యకర్తలు నల్లచీరలు కట్టుకొని వచ్చి నిరసన తెలియచేయడం విశేషం. ధర్నాకు పిసిసి జిల్లా పరిశీలకుడు కన్నా లక్ష్మీనారాయణ, డిసిసి అధ్యక్షుడు సివి శేషారెడ్డిలతో పాటు ఎమ్మెల్యేలు వివేకానందరెడ్డి, రామనారాయణరెడ్డి, రాజ్యలక్ష్మమ్మ నాయకత్వం వహించారు.

## మరణం

కావలి తాలూకా వేములపాడు గ్రామ మునసబు నున్నా వెంకట కృష్ణయ్య మే 25తేది మరణించారు. హృదయం ద్రవింపచేసే మరణం ఇది. ఆయన భార్య 18తేది కన్నుమూశారు. ఆమె తమ కుమారులను చూడడానికి అమెరికా వెళ్లారు. దురదృష్టవశాత్తు అక్కడే చనిపోయారు. అది కృష్ణయ్యను క్రుంగదీసింది. ఆ దిగులుతోనే వారం తిరిగే లోపల దాటుకున్నారాయన. ఆ భార్యా భర్తల అనుబంధం ఎంత ప్రగాఢమైనదో!

* * *





# నిర్యాణము

మా తల్లిగారైన

## శ్రీమతి మన్నెం పద్మావతమ్మ

(కీ.శే. మన్నెం శ్రీనివాసరెడ్డి గారి సతీమణి)

05.06.2000 తేది సోమవారం తెల్లవారుజామున స్వర్గస్తులైనారని తెలియజేయుటకు చింతిస్తున్నాము.

**పెద్దకర్మ** 15.06.2000 తేది గురువారం ఉదయం ప్లాటు నం. 51, కళ్యాణ్‌నగర్, టి.బి. హాస్పిటల్ వెనుక రోడ్డు, హైదరాబాదు నందు జరుగును.

కుమారులు : మన్నెం లక్ష్మీనాథ్ రెడ్డి, మన్నెం కృష్ణమోహన్ రెడ్డి

Tel : 3811884, 6506628

# N నారాయణ కోచింగ్ సెంటర్

హరనాథపురం, నెల్లూరు | విఠల్‌వాడి, హైదరాబాద్ | ఆశీల్‌మెట్, విశాఖపట్నం | మేరీస్టెల్లా కాలేజ్, విజయవాడ

## మా 5వ విజయోత్సవం

## IIIT-2000 ఫలితాలలో 43 ర్యాంకులు

నిన్నటి IIT-JEE-2000లో 35 ర్యాంకులు సాధించి అగ్రగామిగా నిలచి
నేడు IIIT-2000 ఫలితాలలో 43 ఉత్తమ ర్యాంకులు సాధించి
మరోకసారి తన ఆధిక్యతను నిలుపుకున్న **నారాయణ**

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| Mythili Ranganath<br>Rank 11 | Upender Reddy<br>Rank 16 | Deepthinag. D<br>Rank 43 | Vijay Naidu. P<br>Rank 45 | Avinash. V.<br>Rank 62 | Pavan. NV<br>Rank 72 | Sridhar Reddy.A<br>Rank 76 | Geethika Agarwal<br>Rank 78 | Siddarth. M<br>Rank 92 |
| Bharat Varma. N<br>Rank 96 | Ravikumar. N<br>Rank 110 | Vikram Kumar<br>Rank 111 | Ashok. G.<br>Rank 132 | Sreedhar. J<br>Rank 139 | Sasankchowdry<br>Rank 152 | Durga Prasad. C<br>Rank 168 | Vamshi. K<br>Rank 169 | Suresh. A<br>Rank 175 |
| Subbaraju. GV<br>Rank 180 | Manjusha. M<br>Rank 191 | Vinay. C<br>Rank 205 | Prakash. Ch.<br>Rank 207 | Sayanna. C<br>Rank 209 | Jaswanth. S<br>Rank 213 | Krishnaveni. V<br>Rank 223 | Prathush K.<br>Rank 252 | Srinivasareddy. S<br>Rank 254 |
| Mahesh Cahitana<br>Rank 255 | Vivekananda. B<br>Rank 297 | Aditya. SV<br>Rank 306 | Srinivasareddy<br>Rank 342 | Raghukishore GV<br>Rank 370 | Keerthiteja. A<br>Rank 377 | Abdul Aizaz. Md<br>Rank 382 | Chandrika<br>Rank 385 | Balaji. D<br>Rank 414 |
| Raghuchaitanya<br>Rank 417 | Abishek. C<br>Rank 421 | Ganapati Ajay<br>Rank 458 | Anjaniprasad. Y<br>Rank 461 | Sainath. V<br>Rank 475 | Raghuram. G<br>Rank 479 | Sricharan Kishore<br>Rank 494 | | |

సీటు కావలసినవారు రూ.1000లు యం.ఓ. లేదా డి.డి. పంపి సీటు రిజర్వు చేసుకోగలరు.

**EAMCET-2001 ఇంటెన్సివ్ లాంగ్‌టర్మ్ కోచింగ్ ప్రారంభ వివరములు**

1వ బ్యాచ్ : 6.7.2000 | 2వ బ్యాచ్ : 8.9.2000 | 3వ బ్యాచ్ : 6.11.2000 | 4వ బ్యాచ్ : 18.01.2001

## నెల్లూరు జిల్లాలో జూనియర్ ఇంటర్ నందు అత్యధిక మార్కులతో విజయఢంకా మ్రోగించిన 'నారాయణ'

### M.P.C. నందు 470కి 450పైగా మార్కులు సాధించిన మా విద్యార్థినీ విద్యార్థులు

| H.T. No. | Name | Marks | H.T. No. | Name | Marks | H.T. No. | Name | Marks | H.T. No. | Name | Marks | H.T. No. | Name |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 3182895 | Bharathi. P. | 467 | 3184179 | Saran Kishore. V.R. | 464 | 3630632 | Srividya. E | 463 | 3629117 | Geeta. G | 461 | 3636029 | Ajay Varma. D |
| 3186358 | Jyothsna. M | 467 | 3349664 | Prathyusha. M | 464 | 3636604 | Manasa Chandra | 463 | 3630673 | Lakshmi Reddy. G | 461 | 3347935 | Jyothsna. L |
| 3630201 | Sameera Reddy. K | 467 | 3630514 | Rajeswari. PSU | 464 | 3628409 | Sai Sowmya. G | 463 | 3629911 | Harini. V | 461 | 3347648 | Suneel Varma. K.V |
| 3181741 | Hemapriya. B | 466 | 3186123 | Siva Kumar. R | 463 | 3023127 | Bharat. Ch | 463 | 3182372 | Ramyasri. D | 460 | 3628223 | Vidya. R |
| 3183896 | Sudheera. G | 466 | 3181936 | Sandeep Rahul. Ch | 463 | 3181289 | Rajbindu. P | 462 | 3186598 | Deepthi. P | 460 | 3628144 | Avinash. S |
| 3186370 | V. Rakesh Reddy. P | 466 | 3627663 | Prasannalaxmi. P | 463 | 3633467 | Shilpa. P | 462 | 3180072 | Niveditha. G | 460 | 3027608 | Ridhima. P |
| 3346291 | Aditya. A | 466 | 3628816 | Sandeep Patil | 463 | 3182819 | Neelima. B | 461 | 3182893 | Sai Ajay. V.S. | 460 | 3026393 | Sandyadevi. D |
| 3345769 | Pavan Kumar. K | 466 | 3630632 | Srinagasoumya. C | 463 | 3631664 | Vinaysrivastava. V | 461 | 3630921 | Nandita. D.K. | 460 | 3022766 | Srikanth. P |
| | | | | | | 3636012 | Veena. B | 461 | 3632641 | Harini. S | 460 | | |

### Bi.P.C. నందు 440కి 410పైగా మార్కులు సాధించిన మా విద్యార్థినీ విద్యార్థులు

| | | | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 3180732 | Sumanbabu. LS.S. | 422 | 3186419 | Arun Mary. M | 418 | 3181637 | Rajeshkumar. V | 417 | 3183701 | Keerthi. VK | 412 | 3183469 | Sujana. D |
| 3181619 | Sasikala. Ch. | 419 | 3182332 | Silpa. S | 417 | 3186211 | Sukesh Rao. S | 416 | 3186087 | Ramkiranreddy. Ch | 412 | | |

### M.P.C. నందు 470కి 400 పైగా మార్కులు, Bi.P.C. నందు 440కి 400 పైగా మార్కులు సాధించిన మా విద్యార్థులు

MPC

[illegible]

రాష్ట్రస్థాయిలో అత్యుత్తమ మార్కులు, జిల్లాస్థాయిలో ప్రథమస్థానములు సాధించిన మా విద్యార్థులకు హార్థిక శుభా...

**ఉత్తమ విద్యాబోధన, వ్యక్తిగత శ్రద్ధ క్రమశిక్షణ మా ప్రత్యేకతలు**

ఇతర కళాశాలలో జూనియర్ ఇంటర్ చదివిన విద్యార్థులకు కూడా మా కళాశాలలో సీనియర్ ఇంటర్‌లో ప్రవేశము కలదు... సీట్లు పరిమితం...

## పార్టీలో

మొదటి పేజీ కొరవ

ప్రజలలో వారి ప్రభావమూ జాస్తి! అందువల్ల చంద్రశేఖర్‌ను బుజ్జగించడానికి సకల ప్రయత్నాలూ చేస్తున్నారు చంద్రబాబు. కాని ఆ ప్రయత్నాలు ఫలించక ముందే ఈ అసమ్మతి అగ్ని - దావానలం వలె వ్యాపిస్తున్నది. కాళహస్తి శాసనసభ్యుడు, మాజీ మంత్రి గోపాలకృష్ణారెడ్డి, మరొక మాజీ మంత్రి కోడెల శివప్రసాద్, ఎపిఐడిసి ఛైర్మన్ యతిరాజారావు వంటి వారందరూ తమ కార్యకలాపాలను ఉధృతం చేశారు. దాదాపు ప్రతి జిల్లాలో ఒకరిద్దరు శాసన సభ్యులు వీరి పట్ల సానుభూతి ప్రదర్శిస్తున్నారు. మరీ విచిత్రం - కొందరు మంత్రులు సైతం వీరిని చేరదీయడం. ఎక్సైజ్ మంత్రి తుమ్మల నాగేశ్వరరావు తన అసహనాన్ని దాచుకోవడం లేదు; బహిరంగంగా, తనను కలవడానికి వచ్చే ఎమ్మెల్యేలు, ఇతర నేతల వద్ద వ్యక్తం చేస్తున్నారు. అసమ్మతి వీరులను నిస్సంకోచంగా తన ఇంటికి రప్పించి, మాట్లాడుతున్నారాయన. రెవిన్యూ మంత్రి అశోక్ గజపతిరాజు, హోం మంత్రి దేవేంద్రగౌడ్‌లు సైతం చంద్రబాబు వైఖరి పట్ల నిరుత్సాహ పడుతున్నారు. ప్రభుత్వ నిర్వహణలో ముఖ్యమంత్రి నియంతృత్వం; అధికారులు మంత్రులను చులకన చేసి మాట్లాడుతున్నా ముఖ్యమంత్రి పట్టించుకోక పోవడం; వరుసబెట్టి ప్రజావ్యతిరేక నిర్ణయాలు తీసుకోవడం; ధనికులు, విదేశీయులు, పారిశ్రామికవేత్తలకే ముఖ్యమంత్రి వద్ద ప్రాధాన్యత లభించడం వంటి పరిణామాలు వీరికి రుచించడం లేదు.

జరుగుతున్న సంఘటనల పట్ల అందరూ మౌనంగా వుండిపోతే - పరిస్థితి పూర్తిగా చేయిదాటి పోతుందని; పార్టీ నష్టపోతే చంద్రబాబు కంటే అధికంగా తామూ సర్వం కోల్పోవలసి వస్తుందని; అందువల్ల మొదట్లోనే తామందరం కలిసి ముఖ్యమంత్రిని హెచ్చరించడం అవసరమని మంత్రులు భావిస్తున్నారు. పదవిలో వుండేవారే తమ వాదనలను బలపరుస్తుండడంతో అసమ్మతి వాదులకు ఏనుగెక్కినంత సంబరం కలుగుతున్నది. వారు మరింత ఉత్సాహంగా పదిమందినీ కలిసి, పబ్లిక్‌గా మాట్లాడేస్తున్నారు.

ఖమ్మం వంటి జిల్లాలలో కరెంట్ నిరసన గ్రామగ్రామానికి పాకి పోవడానికి తెలుగుదేశం స్థానిక నేతల సహకారమే కారణమని ఇంటలిజెన్స్ నివేదికలు స్పష్టం చేస్తున్నాయి. సిపిఎం, కాంగ్రెస్ వాదులతో కలిసి తెలుగుదేశం కార్యకర్తలు సైతం ఈ కార్యక్రమాలలో పాలు పంచు కొంటున్నారు. గ్రామాలలో రైతుల ఆగ్రహం చూసిన తెలుగు కార్యకర్తలు, కరెంట్ ధరలను సమర్థిస్తూ మాట్లాడ లేకపోతున్నారు. నిరసనలో గొంతు కల్పక తప్పడం లేదు వారికి!

## నెల్లూరు సబార్డినేట్ జడ్జి వారి కోర్టులో

**E.P. No. 4/1994** **O.S.No. 222/1982**

Between

స్టేట్‌బ్యాంక్ ఆఫ్ ఇండియా, నెల్లూరు - డిక్రీహోల్డరు / వాది

మరియు

1) బి.ఎస్. ప్లాస్టిక్స్ మేనేజింగు పార్టనరు, శ్రీ పొన్నూర సుబ్రమణ్యం, 2) ఇందర్ మెటల్ ఇండస్ట్రీస్, మేనేజింగు పార్టనరు, శ్రీ పొన్నూర సుబ్రమణ్యం, 3) పొన్నూర సుబ్రమణ్యం అండ్ సన్స్ ప్రొప్రయిటర్, శ్రీ పొన్నూర సుబ్రమణ్యం, 4) శ్రీ పొన్నూర సుబ్రమణ్యం, 5) శ్రీ ఆర్. హరిరత్తయ్య, 6) శ్రీ ఆర్. వెంకటేశ్వర్లు 7) శ్రీమతి పి. లక్ష్మీ కాంతమ్మ, 8) రామాకాంతమ్మ, 9) శ్రీ పొన్నూర నాగరాజ, 10) శ్రీ గుంటూరు వెంకటసుబ్బయ్య, 11) శ్రీ పొన్నూర సురేష్‌బాబు, 12) పొన్నూర సురేంద్రబాబు - రెస్పాండెంట్స్ / J.D.Rs

### స్థిరాస్తి వేలము ప్రకటన

ఇందుమూలముగా తెలియజేయుట ఏమనగా పై నంబరు వాది రూ.8,98,333.90లు డిక్రీ బాకీ దంబులా వడ్డీ ఖర్చులు రాబట్టు నిమిత్తమై క్రింది షెడ్యూలు దాఖలా ఆస్తులను బహిరంగముగా వేలము వేసి వేలములో వచ్చిన మొత్తము డిక్రీ బాకీలోనికి జమ చేయవలసిందిగా కోరుచూ పై కోర్టులో E.P.No. 4/94 అములు దరఖాస్తు దాఖలు చేసియున్నారు. ఈ క్రింద కనబరచిన షెడ్యూలు దాఖలా ఆస్తులను కోర్టువారు నెల్లూరు సీనియర్ సివిల్ జడ్జి (సబార్డినేట్ జడ్జి) వారి కోర్టులో 21.6.2000 తేదిన పై కోర్టు ఆవరణములో ఉదయం గం.10.30లకు బహిరంగముగా వేలము వేయబడును. వేలములో పాల్గొనదలచినవారు 21.6.2000 తేది ఉదయం గం.10.30లకు హాజరై పాల్గొనవచ్చును.

నెల్లూరు
9.6.2000

**యం. గోపాలాచారి**
డిక్రీహోల్డరు తరఫున అడ్వకేటు

**SCHEDULE - A**

Nellore District Registration, Nellore Sub-Registration, Nellore Town, Santhapet, House bearing Ward No.10, Door No.89; and 89-A; 13 Ankanams bounded as follows:

East : Compound wall of the house bearing No. 10/90
West : Public Street
North : Own wall of the house abutting with a pathway (Varasandu)
South : Pathway with gate fixed in between houses 10/89-A and 10/94-A which is enjoyed jointly.

Extent - 13 Ankanams; Value Rs.15,000/-
Amin Value : Rs.2,00,000/-

Item No.2 :

Nellore District Registration, Nellore Sub-Registration, Nellore Town house bearing Ward No.17, Door No.193; measuring 5 Ankanams of site with 3 ankanams of tiled house bounded as follows:

East : Joint wall between this house and house No. 194
West : Joint wall between this house and house No. 193 and 192
North : Public Street
South : Own wall of the premises along with backyard.

Extent : 5 ankanams of site, 3 ankanams of tiled house.
Value : Rs.15,000/-
Amin Value : Rs.50,000/-

Item No. 3:

Nellore District Registration, Nellore Sub-Registration, Nellore Town house and vacant site bearing Ward No.10; Door No. 92; situated in Santhapet, Nellore bounded as follows:

East : Joint wall of this house and Subbaramaiah house.
West : Joint wall of this house and Subbaramaiah house.
North : Schedule house adjacent to the vacant site
South : Public Street

Extent : 7 ankanams site 3 ankanams of terraced house.
Value : Rs.20,000/-
Amin Value : Rs.5,00,000/-

Item No. 4:

Nellore District Registration, Nellore Sub-Registration, Nellore Town, Santhapet, bearing Ward No.10, Door No.95; house and vacant site bounded as follows:

East : House wall belonging to V. Nagaraja
South : House wall of Schedule property to some extent and joint wall between schedule house and Door No. 95
West : Public Street
North : Joint way for go to the gate of Nos. 90 to 94-A houses extent vacant site 3 ankanams tiled house, 4 ankanams of half share in lavotary situated in 2 ankanams of vacant site.

Total Site : 9 Anakanams
Value : Rs.25,000/-
Amin Value : Rs.2,00,000/-

**M. GOPALACHARI**
Advocate for Petitioner

**SCHEDULE - B**

Item No. 1:

Nellore District Registration, Muthukur Sub-Registration, land situated in Vallur village, H.O. Tallapudi bearing patta No. 204, S.No. 307, extent Ac.1.78 3/4 cents

Extent : Ac.1.78 3/4 cents
Value : Rs. 7,500/-
Amin Value : Rs.80,000/-

Item No. 2 :

Nellore District Registration, Muthukur Sub-Registration, wet land in Vallur village, H.O. of Tallapudi bearing Patta No.204, Survey No.305, extent Ac.1.29 cents.

Extent : Ac. 1.29 cents
Value : Rs. 6,500/-
Amin Value : Rs.70,000/-

**(M. GOPALACHARI)**
Advocate for Petitioner



## రామోజీరావు

మొదటి పేజీ కొరవ

కల్పించడానికి నిర్ణయించి, ఆ ప్రతిపాదనలకు రామోజీరావు గారు సమ్మతి తెల్పిన తర్వాత - వూపిరి పీల్చుకొని కారెక్కాడు చంద్రబాబు. రామోజీరావు అంత గట్టి పట్టు పట్టకుండా వుండివుంటే - ధరలు తగ్గించే ప్రశ్నే లేదు.*

## జిల్లావార్తలు

12వ పేజీ కొరవ

ప్రవీణ్‌కుమార్‌రెడ్డి మాట్లాడుతూ తాను దేవకుమార్ రెడ్డికి టిక్కెట్ ఇవ్వమని చెప్పినా వైఎస్. రాజశేఖరరెడ్డి పట్టించుకో లేదన్నారు. పార్టీ కార్యకర్తల్లో చైతన్యం నింపేందుకు ఈ సమావేశం ఏర్పాటు చేశారా లేక నేతలను విమర్శించను చేసారా? అనే విషయం తెలియక సమావేశానికి వచ్చిన వారు తలలు పట్టుకొన్నారు.

### నెల్లూరులో కాపురం - సంగంలో వుద్యోగం!

సంగం ఎస్‌ఐ బాబు నెల్లూరులో కాపురముండి ఫోన్ ద్వారా స్టేషన్‌ను నడిపిస్తున్నారు. తెలుగుదేశం పార్టీ నాయకులు చెప్పినట్లు నడుచుకొనే ఈ ఎస్‌ఐ నెల్లూరులో కోవూరు ఎమ్మెల్యే ప్రసన్నకుమార్‌రెడ్డి వుంటే ఆయనను ప్రసన్నం చేసుకోవడం, రూరల్ డిఎస్పీ, సివిలకు మామూళ్లు అందించే విషయంలో చూపించే శ్రద్ధను డ్యూటీ మీద చూపించడం లేదు. మండలంలో ఏదైన సంఘటన జరిగి బాధితులు పోలీస్ స్టేషన్‌కు వచ్చి ఫిర్యాదు చేశాక, ఆయన వర్గీయులైన కానిస్టేబుల్లు రేటు కుదుర్చుకొని ఎస్‌ఐకు ఫోన్ చేసి చెబితే నెల్లూరు నుంచి కదలు తున్నారనే విమర్శ వుంది. కానిస్టేబుల్ల డ్యూటీని కూడా ఎస్‌ఐ ఫోను ద్వారా చెబుతారని, హెడ్‌కానిస్టేబుల్ దొమహాయం ప్రతినిత్యం వ్రాసి డైరీలో వ్రాయడం దీన్ని ఆకస్మిక తనిఖీకి వచ్చిన ఎస్పీ చూడడంతో ఎస్‌ఐ అతనిపై అగ్గిమీద గుగ్గిలమయ్యారు. ఈ సందర్భంగా ఎస్పీ రికార్డు కూడా సక్రమంగా రాయని ఎస్‌ఐ జిల్లాలో నీవొక్కడివేనని బాబుని మందలించినట్లు తెలిసింది. ఎమ్మెల్యే ప్రసన్నకుమార్‌రెడ్డి సిఫార్సు వుండడం వల్ల బదలీ ఎస్‌ఐ బాబు దరిచేరినట్లు లేదు. ఎస్‌ఐ పోలీస్ స్టేషన్‌లలో డ్యూటీ చేయడం మాని ఎమ్మెల్యేల ఇంటి వద్ద డ్యూటీలు చేసే రోజులొచ్చాయి. శాంతి భద్రతల సంగతి ఎవరికీ పట్టకుండా పోయింది.



మోచెర్ల రామకృష్ణయ్య 96వ జయంతి సభలో వక్త డాక్టర్ కె. మెహర్‌మణిని సన్మానిస్తున్న డి.వి. రమణయ్య, అగస్త్యరెడ్డి వెంకురెడ్డి, సభాధ్యక్షులు అన్నలూరు సత్యనారాయణ, పొన్నాల రామసుబ్బారెడ్డి తదితరులు.

### లైసెన్సులు లేని మందుల షాపులు

సర్వేపల్లి నియోజక వర్గ పరిధిలోని తోటపల్లి గూడూరు, సర్వేపల్లి, ముత్తుకూరు మండల కేంద్రాలతో పాటు పలు గ్రామాల్లో డ్రగ్ లైసెన్సులు లేకుండానే మందుల షాపులను నిర్వహిస్తున్నారు. ఈ షాపులను ఎవరో ఒక ఆర్‌ఎంపి డాక్టర్ ప్రాక్టీస్ చేసే ప్రాంతంలో పెట్టుకొంటున్నారు. చీప్ క్వాలిటీ మందులు, డాక్టర్స్ శాంపిల్స్ ఈ షాపుల్లో సునాయాసంగా అమ్ముకొంటూ, సొమ్ము చేసుకొంటున్నారు. ఫ్రిజ్‌లో భద్రపర్చాల్సిన మందులు కూడా బయటపెట్టి అధిక ధరలకు అమ్ముతున్నారు. డ్రగ్ ఇన్స్‌పెక్టర్లు పత్తా లేక పోవడంతో డ్రగ్ లైసెన్సులు లేని మందుల షాపుల వ్యాపారం మూడు పువ్వులు, ఆరు కాయల్గా విరాజిల్లుతుంది.

### కార్మికుల కనీసకూలి 70 రూపాయలు!

2000-2001 సంవత్సరానికి గాను జిల్లాలో వివిధ పనులు చేసే నైపుణ్యం లేని కూలీల కనీస వేతనం రోజుకు 70 రూపాయలుగా నిర్ణయించినట్లు జిల్లా కలెక్టర్ శ్రీలక్ష్మి చెప్పారు. రోజుకు 8 గంటలు పనిచేసే కార్మికులలో హెడ్‌మజ్దూర్, మెన్, ఉమెన్ మజ్దూర్‌లకు రోజువారీ వేతనం 70 రూపాయలు చెల్లించే విధంగా అధికారులు చర్యలు తీసుకోవాలన్నారు. మునిసిపల్ పరిధిలో పనిచేసే కార్మికులకు పై వేతనానికి అదనంగా 15 రూపాయలు కలిపి చెల్లించాలన్నారు. ఈ వేతనాలు మే నెల 1తేదీ నుంచి అమలులోకి వచ్చినట్లు కలెక్టర్ వివరించారు.

### గూడూరు పెద్దాసుపత్రిలో బ్రహ్మాండంగా సేవలు

గూడూరు ప్రభుత్వాసుపత్రిలో ప్రజలను బ్రహ్మాండంగా సేవలందిస్తున్నట్లు హాస్పిటల్ సివిల్ సర్జన్ స్పెషలిస్ట్ డాక్టర్ రామసుబ్బారెడ్డి తెలిపారు. జమీన్‌రైతులో ఈ ఆసుపత్రి పని తీరుపై వచ్చిన వార్త విషయమై స్పందించారాయన. గూడూరు ఆసుపత్రిలో గత మూడు నెలల్లో 259 ఆపరేషన్లు చేసి రాష్ట్రంలోని ప్రభుత్వ ఆసుపత్రుల్లోనే మొదటి స్థానంలో నిలిచిందన్నారు. ఆసుపత్రిలో పనిచేసే మెడికల్ ఆఫీసర్‌కు ప్రైవేటు ప్రాక్టీస్ లేదని, ఆసుపత్రిలో పనిచేస్తూ ప్రైవేట్ క్లినిక్ వుండే డాక్టర్లు కూడా ఉదయం 9 గంటల నుంచి మధ్యాహ్నం 2 గంటల వరకు ఖచ్చితంగా విధులకు హాజరవుతారని చెప్పారు.

### తుమ్మగుంటలో శాస్తా కళ్యాణం

తుమ్మగుంట గ్రామంలోని అయ్యప్ప స్వామి వారి దేవస్థానంలో శాస్తాకళ్యాణ మహోత్సవం 3తేదీ అత్యంత వైభవంగా జరిగింది. వైదికరత్న మాచవోలు రాజశేఖరవర్మ నేతృత్వంలో ఈ కార్యక్రమం జరిగింది. ఉభయకర్తలు, తుమ్మగుంట అయ్యప్ప సమాజం అధ్యక్షులు వైరాధాకృష్ణారెడ్డి ఈ కార్యక్రమాన్ని పర్యవేక్షించారు. ఈ సందర్భంగా స్వామివారి గ్రామోత్సవం జరిగింది.

### విద్యుత్ రేట్ల పెంపుపై రైతు సంఘం ధర్నా

విద్యుత్‌రేట్ల పెంపుదలను నిరసిస్తూ సిపిఎం అనుబంధ సంస్థ రైతు సంఘం ఆధ్వర్యంలో తోటపల్లి గూడూరు, కోడూరు విద్యుత్ సబ్‌స్టేషన్ల ఎదుట ధర్నాలు జరిగాయి. ఈ కార్యక్రమంలో సిపిఎం నాయకులు రమణయ్య, రాపూరు కోదండయ్య పాల్గొన్నారు.

### జ్యోతిష పండిత సన్మానం!

ఇందుకూరుపేట రాధాకృష్ణ మందిరాన జ్యోతిష, సాముద్రిక నిపుణులు చక్కిరాల శ్రీనివాసులు 28తేది వామనావతార ఘట్టంపై ఉపన్యసించారు. ప్రతి మనిషి దయ, ప్రేమ వుండాలని, భగవానుడు భక్తుడు పిలిస్తే పలుకుతాడని చెప్పారు. కంచెం పురుషోత్తమ రావు ఈ సందర్భంగా శ్రీనివాసులును సన్మానించారు.

## మన మంచికే

12వ పేజీ కొరవ

సీరియల్ వున్నదున్నట్లు ఎస్‌ఆర్‌లో వ్రాయడంతో అసలు విషయాన్ని పరిశీలించకనే స్క్వాడ్ అధికారులు అతన్ని సస్పెండ్ చేశారు. ఈదూసి బస్సు కండక్టర్ ఇస్మాయిల్ ఇదే పరిస్థితి ఎదురైతే విషయాన్ని అధికారుల కళ్లకు కట్టినట్లు చూపించడంతో సస్పెన్షన్ వేటు నుంచి తప్పించుకొన్నాడు. టిక్కెట్లు కండక్టర్లకు ఇచ్చే ముందు సరిచూడాల్సిన డిపోలు, ఎసిలు బాధ్యతలు విస్మరించడంతో ఈ పరిస్థితి దాపురించింది. వాస్తవాలు తెలిసి కండక్టర్లను సస్పెండ్ చేయడం అన్యాయం. ఆర్‌ఎం గారు ఈ విషయాన్ని మీరు పరిశీలించండి.

# నా రూటే వేరు - నన్ను భరించలేరు

తాను కొంచెం వైరైటీ ఆడదాన్ననిఅందుకే తన్నెవరూ భరించలేరంటుంది ఊర్మిళ. అయితే తాను మాత్రం అందర్నీ భరిస్తానంటుంది. ఎవరితో అయినా సరదా పోగల ఓర్పు, నేర్పు కలిగిన దాన్ని. ఎవర్నీ విసుక్కోను, ఎవర్నీ నొప్పించను. ఇతరులు నన్ను ఎందుకని భరించరని అప్పుడప్పుడూ అనిపిస్తుంటుంది. నేను తరచూ ఆలోచిస్తుంటాను. నేనే నా మూడీ మనస్తత్వాన్ని మార్చుకొంటే బావుంటుంది కదా అని - కాని అనేకసార్లు ప్రయత్నించిన అనంతరం నాకు అర్థమైన విషయం ఏమిటంటే, ఊర్మిళ రూపం మారవచ్చు. మనసు మారవచ్చుగానీ స్వభావం మాత్రం మారదని చెప్పింది.

## నిజం మాట్లాడేందుకు భయపడను

తనకు చేతకాని విషయాలు రెండు వున్నాయంటుంది 'ఆకాశవీధి లో' చిత్రంలో హీరోయిన్ రవీనాటాండన్. వీటిని గుర్చి చెబుతూ, కడుపులో ద్వేషం ఉంచుకొని పైకినవ్వుతూ మాట్లాడడం, ఇతరులకి గోతులు తవ్వడం. కానీ ఇలాంటి స్వభావం వున్నవారే పరిశ్రమలో ఎక్కువంది. తానిలాంటి వారితో అసలు మాట్లాడనని, అంటీ అంటనట్లు వుంటానంది. ఒకవేళ నా జోలికి వస్తే కనుక నేను నిర్మొహమాటంగా మాట్లాడుతాను. దీనివల్ల కొంత మంది నాకు దూరమయ్యారు. అయినా

### ఊర్మిళ ఉవాచ

నేను బాధపడను. నేను మాట్లాడిన దాంట్లో నిజం వున్నప్పుడు నాకేల బాధ భయమంటుంది రవీనా.

## వాస్తవాలను విస్మరించను

తానెప్పుడూ వాస్తవంలో జీవిస్తానని బాలీవుడ్ న్యూ సెన్సేషన్ హృతిక్ రోషన్ చెప్పారు. నాలో భావుకత వుంది. కానీ భావుకత్వంలో పడి వాస్తవాన్ని విస్మరించే అలవాటు లేదన్నాడు. ప్రకృతి అందాలను చూస్తూ వివశుణ్ణవుతాను కానీ సమయాన్ని మర్చిపోవడం జరుగదన్నాడు. బ్యాలెన్స్‌డ్‌గా వున్నవాడే విజయావకాశాలను అందిపుచ్చుకో గలడని హృతిక్ దృఢ నిర్ణయం.

## కంప్యూటరే నా నేస్తం

ప్రస్తుతం కంప్యూటర్ తన నేస్తమంటుంది గ్లామర్ హీరోయిన్ నఘ్మ. కంప్యూటర్ ముందు కూర్చొంటే నాకు టైమే తెలియదు. నాకు సంబంధించిన వెబ్‌సైట్ ఏది ప్రారంభించకపోయినా, సినిమాలకు సంబంధించిన వెబ్‌సైట్ వాళ్లకు నా అందమైన ఫోటోలిచ్చాను. నా కంప్యూటర్‌కు ఇంటర్నెట్ కనెక్షన్ వుంది. ఎప్పుడైనా షూటింగులు లేకపోతే వెళ్లిదాని ముందు కూర్చొని వెబ్‌సైట్ ఓపెన్ చేసి చూస్తుంటాను అలాగే ఫ్రెండ్స్‌కు 'ఇ' మెయిల్స్ పంపిస్తుంటాను. తిండి, నిద్ర కూడా లేకుండా దాని ముందు గంటల గంటలు గడుపుతున్నానని అమ్మానాన్నలు ఒకోటే తిడుతున్నారని చెప్పింది.

ఎస్.పి. ఎంటర్‌టైన్‌మెంట్స్ నిర్మిస్తున్న చిత్రంలో షహీన్, వేణు

# శృంగారపర్వంలో భక్తిమార్గం

సినీవాళ్లకు ఓపిక ఉండాలేగాని స్వంత డబ్బా కొట్టుకోవడంలో సినీతారలకు ఎవరూ తీసిపోరు. శృంగార తార రమ్యకృష్ణ ఈ విషయంలో ముందంజలో వుంది. నిన్న మొన్నటి వరకు వంటి మీద గుడ్డనే బరువుగా భావించిన రమ్యకృష్ణ దైవ సంబంధమైన ఒక్క పాత్రలో నటించాక తానేదో అపర పవిత్ర అవతారమని భ్రమ పడుతూ కథలు చెబుతోంది. సాధారణంగా

### రమ్యకృష్ణ స్వంత డబ్బా

ఇంట్లో సెలవు రోజుల్లోనే ఫ్యామిలీ గెట్ టుగెదర్‌లలోనే మా చెల్లెలు, దాని స్నేహితులు, మా కజిన్‌లు, అందరమూ ఒక్కచోట చేరి అల్లరల్లరి చేస్తుంటాం. ఒకర్నొకరం ఆట పట్టించుకొంటూ వుంటాం. ఇన్నేళ్ళ సజావుగా సాగిన ఈ వేళాకోళాల కార్యక్రమం ఈ మధ్య బలహీనమైంది. ఎందుకంటే నాకజిన్స్ కానీ, మా చెల్లెలు ఫ్రెండ్స్ కానీ నన్ను ఫ్రీగా అంతకు ముందులా ఆటపట్టించడానికి వెనుకాడుతున్నారు. ఎందుకని అడిగితే, ఎందుకో నువ్వీ మధ్య అమ్మవారి వేషాలేశాక నిన్ను చూస్తే భయమూ, భక్తి కలుగుతుందే; మునుపటిలా వెక్కిరించాలన్నా, ఏడిపించాలన్నా బెదురుగా వుందని చెబుతున్నారని తెలిపింది. గ్లామర్ మావైపు ఉరిమిచూసి మమ్మల్ని కాల్చేస్తావేమోనని అనుకుంటున్నారు. ఒక్కమేమంతేగానేదో బానే వుందనుకొన్నా మనమంటే ఆ మాత్రం భయముండాల్సిందే అంటుంది.

## కొబ్జా పాత్రలో ప్రకాష్‌రాజ్

వైవిధ్య భరితమైన పాత్రలు పోషించే నటుడు ప్రకాష్‌రాజ్ తాను పోషించిన ద్విపాత్ర [illegible] చిత్రం చేస్తున్నాడు. ఈ చిత్రంలో తాను 'కొబ్జా' పాత్రను పోషిస్తున్నానన్నారు. తెలుగు, తమిళ, కన్నడ భాషల్లో తయారవుతున్న ఈ చిత్రంలో ప్రశాంత్ దేవయాని జంటగా నటిస్తున్నారు - వసంత్ దర్శకత్వం వహిస్తారు.

# పెళ్లికి 'నో' అంటున్న 'కోవై'

'క్షేమంగా వెళ్లి లాభంగా రండి' సినిమా చూసిన ప్రతి ఒక్కరి మనసు దోచిన నటి కోవై సరళ అంటే అతిశయోక్తి కాదు. తమిళంలో తిరుగులేని హాస్యనటి అయిన సరళ తాను జీవితాంతం 'బ్రహ్మచారిణి'గానే వుంటానంటుంది. ఈ నిర్ణయం ఎందుకు తీసుకొన్నారని చాలా మంది అడుగుతుంటారు. దీనికి నేను చెప్పిన్న సమాధానం ఒక్కటే! ప్రస్తుతం సమాజంలో నెలకొనివున్న పరిస్థితులు చూస్తుంటే, ఇప్పుడున్న ఈ పరిస్థితుల్లో ఒకరిని వివాహం చేసుకొని ప్రశాంతంగా బతకగలమా అన్న సందేహం కలుగుతుంది. అసలు నాకు ఆ నమ్మకమే లేదు. మనిషిని ఈగో ప్రాబ్లం ఒకవైపు, నిరాశ, ఆర్థిక అసంతృప్తి, స్వార్థం వంటివన్నీ మరోవైపు జాడ్యాలుగా పట్టిపీడిస్తున్నాయి. ఇలాంటప్పుడు దాంపత్య జీవితం సుఖంగా సాగుతుందన్న నమ్మకం నాకు లేదు. అందుకే పెళ్లి జోలికి వెళ్లకూడదుగాక వెళ్లకూడదని నిర్ణయించుకొన్నట్లు చెప్పింది.

## ఇప్పుడే హీరోయిన్‌నుకాను

అంజలి, క్రిమినల్ సినిమాల్లో చిన్నపాపగా నటించిన షామిలి, తన అక్క, పెళ్లి సందర్భంగాపట్టు పరికిణీలో తిరుగుతూ పలువురు నిర్మాతల కళ్లల్లో పడింది. వీరిలో కొందరు ఔత్సాహిక నిర్మాతలు షామిలి వాళ్ల నాన్నకు ఫోన్లు చేసి మీ రెండో అమ్మాయిని హీరోయిన్‌గా బుక్ చేయాలనుకొంటున్నాం అని అడగనారంభించారట. ఈ విషయమై షామిలి

### హైదరాబాద్ సినిమావార్తలు

మాట్లాడుతూ తన కిప్పట్లో సినిమాల్లో నటించే ఉద్దేశ్యం లేదని చెప్పింది. నేనింకా చదువుకోవాలి. ఇప్పుడే ఎనిమిదో తరగతికి వచ్చాను. చదువు కోకుండా సినిమాల్లోకి వస్తే ఎలా? ప్రస్తుతం డ్యాన్స్, యోగా, సంగీతం నేర్చుకొంటున్నాను. నటన అనేది నాకేమీ కొత్తకాదు కాబట్టి ఇప్పటి కిప్పుడు అర్జంటుగా సినిమాల్లో నటించాలన్న తొందర తనకేమీ లేదంది.

## డబ్బుపై ఆశలేదు

తాను విదేశాలలో స్టేజి షోలను ఇవ్వడం డబ్బుపై ఆశతో కాదని హీరో ప్రశాంత్ చెప్పాడు. నేను నా సినిమాలకు ఇచ్చే ప్రాముఖ్యత స్టేజి షోలకు ఎట్లా ఇస్తాను. షూటింగులు లేని సమయాల్లో స్టేజి షోలకు సమయాన్ని కేటాయిస్తున్నాను. అసలు డబ్బు పిచ్చి నిజంగా వుంటే నా పారితోషికం ఎప్పుడో మూడు రెట్లు పెంచివుండే వాణ్ణి కాని నాకు అలాంటి ఆశ్యాశలేదు. పైగా సంపాదిస్తున్న డబ్బులో సగం ప్రేక్షాభిమానులకు ఉత్తరాలు రాయడానికి, వారికి నా చేతనైన సహాయం చేయడానికే ఉపయోగిస్తుంటాను. విదేశాలలో వున్న నా అభిమానులను ఆహ్లాద పర్చడానికి, వారి అభిమానాన్ని ప్రత్యక్షంగా చూసి ఆనందించడానికే స్టేజ్ షోలకు వెళ్తుంటాను. అంతే తప్ప నూటికి నూటయాభైశాతం తనకు డబ్బు పిచ్చి లేదంటున్నాడు.

# అత్తగారి అరవగోల అమ్మగారి తెలుగు జోల

తన తల్లికి వచ్చిన భాష, అత్తకు రాకపోవడం, అత్తకు మాట్లాడను వచ్చిన భాష తల్లికి రాకపోవడం వల్ల తన ఇంట్లో పెద్ద సమస్యలు లేవని హీరో శ్రీకాంత్ చెప్పాడు. దీన్ని గూర్చి వివరిస్తూ మా అమ్మకు తెలుగు తప్ప వేరే భాష మాట్లాడడం, అరు చేసుకోవడం

### శ్రీకాంత్ సంబరం

రాదు. అందుకని ఆమె తెలుగే మాట్లాడుతుంది. ఇక మా అత్త గారికి తమిళం తప్ప ఇంకే భాషా అర్థం కాదు. ఇద్దరిలో ఒకరి మీద ఒకరికి కోపం వచ్చినా తిట్టుకొన్నా ఇంకొకరికి అర్థం కాదు కాబట్టి గొడవలు మరెవి ఆవాడు లేదు. రెండు భాషలు తెలిసినా నేను, నా భార్య ఊహ అసలు గొడవల్లో తలదూర్చం. భాషలు వేరవడం వల్ల ఎంత సుఖముంటుందో దానికి తమ ఇల్లే నిదర్శనమన్నారాయన

## తెలుగు సినిమాల వల్లే ఇంతదాన్ని అయ్యాను

తెలుగు సినిమాల్లో హీరోయిన్‌గా నిలదొక్కుకోవడం వల్లే ఇతర భాషల్లో తనకు ఎక్కువ అవకాశాలు వచ్చినట్లు గ్లామర్ హీరోయిన్ రంభ చెప్పింది. తెలుగు చిత్రాలకు ప్రస్తుతం ఎందుకు ప్రాధాన్యత ఇవ్వడం లేదని ప్రశ్నించగా, తాను కావాలని తెలుగు సినిమాలను నిర్లక్ష్యం చేయడం లేదంది. తెలుగు, తమిళ చిత్రాలు ఏక కాలంలో చేస్తూ అనుకోకుండా తమిళంలో బిజీ అయ్యాను.

తరువాయి 11వ పేజీలో

# పాత చింతకాయ పచ్చడి 'ఒకేమాట'

### చిత్రసమీక్ష

గ్రిద్దలూరు గోపాలరావు

"ఒకేమాట, ఒకే భార్య, ఒకే బాణం" ఇది పురాణ యుగంలో శ్రీరామునికి పరిమితమైన ఒక జీవిత ధర్మం. ఆ నీతి విధానాన్ని అంబికా కృష్ణ, ముత్యాల సుబ్బయ్య దర్శకత్వంలో నిర్మించిన "ఒకే మాట" చిత్రంలో హీరో సూర్యంకు అన్వయింపజేశాడు. సూర్యం భార్య శిరీష అతన్ని వదిలేస్తుంది. అది అదనుగా చూసుకొని ఒక అమ్మాయి తనను పెళ్లి చేసుకోమని సూర్యంను అడుగుతుంది. అప్పుడు సూర్యం నాది "ఒకేమాట", నాకు "ఒకే భార్య", అని ఖచ్చితంగా శ్రీరామునికి ప్రతిరూపంగా నిలిచిచెప్తాడు. ఆ మాట మీదే నిలబడి వుంటాడు. ఆ ఒకే మాటను చిత్రానికి పేరు పెట్టారు. సూర్యం భార్య శిరీష ఆయన్ను ఎందుకు వదిలేసింది, వదిలేసినా, తన భార్య పట్ల సూర్యం ఎందుకంత ప్రేమ, గౌరవం నిలుపుకున్నాడు అన్న విషయాలు తెలుసుకోవలసినవి. సూర్యం (ఉపేంద్ర), శిరీష (రమ్యకృష్ణ) "లా" కాలేజీలో చదువు తుంటారు. సూర్యం మనసు దనాన్ని, అభ్యుదయ భావాలను గుర్తించిన శిరీష, అతన్ని ప్రేమిస్తుంది. అతను ఆమె ప్రేమను అంగీకరిస్తాడు. ఆమె అతన్ని పెళ్లి చేసుకోవాలను కుంటుంది. అందుకు అతను నిరాకరిస్తాడు.

శిరీష శ్రీమంతురాలు. ఆమెకు ఒక అన్న (సూర్య) వున్నాడు. అన్నా చెల్లెళ్ల ప్రేమానుబంధం చాలా బలమైంది. సూర్యం బెస్త కుటుంబానికి చెందినవాడు. ఇతనికి గంగరాజు (నాగేంద్ర బాబు) అనే అన్న వున్నాడు. సూర్యంకు అన్న అంటే పంచప్రాణం. శ్రీమంతురాలైన శిరీష పేదవాడైన సూర్యంను పెళ్లి చేసుకోవటం ఆమె అన్నకు ఇష్టం లేదు. కాని శిరీష పట్టు బట్టడంతో ఆమె పెళ్లి సూర్యంతో ఘనంగా జరిపిస్తాడు ఆమె అన్న.

ఒక కోడలు, అత్త మీద కోపం దుత్త మీద చూపి దాన్ని పగల గొట్టిందట. ఆ విధంగా శిరీష అన్న, సూర్యం మీద కోపంతో అతని అన్న గంగరాజును చాలా రహస్యంగా చంపేస్తాడు. ఈ హత్య విషయం చివర వరకు సస్పెన్సులో వుంటుంది. తన అన్న చావు విషయాన్ని గూర్చి ఆరాతీస్తుంటాడు సూర్యం. శిరీష అన్న, తన అన్న గంగరాజును చంపాడని తెలుసుకున్న క్షణాన సూర్యం, శిరీష అన్నను చంపేస్తాడు. సూర్యం, శిరీష అన్నను చంపటంతో శిరీష, సూర్యంపై కోపగించుకొని కక్ష బూనుతుంది. తాను శిరీష అన్నను ఎందుకు చంపవలసి వచ్చిందో ఆ విషయాన్ని సూర్యం చెప్పేలోపుగానే, శిరీష వెళ్ళిపోయి తన భర్త సూర్యం చనిపోయినట్లు విధవరాలుగా తయారై సూర్యం ముందు నిలుస్తుంది. "నువ్వు చనిపోయినట్లుగా భావించి నిన్ను వదలి వెళ్లిపోతున్నాను" అంటూ శిరీష సూర్యాన్ని విడిచి వెళ్లిపోతుంది.

సూర్యం లాయరు వృత్తి మాని బెస్తవారి అభివృద్ధి కోసం పాటుపడుతూ అందరిమన్ననలు పొందుతూ వుంటాడు. అతని కార్యకలాపాలకు శిరీష అడ్డు తగులుతూ వుంటుంది. బెస్తవారి వ్యాపారానికి చెందిన సహకార సంఘం ఎన్నికల్లో మళ్లా జరుగుతాయి. చివరకు ఇంకా కొన్ని విషయాల్లో రక్తపాతం జరుగుతుంది. తన అన్నను సూర్యం చంపిన కారణం శిరీషకు తెలుస్తుంది. సూర్యం నుంచి తనను విడగొట్టేందుకు తన అన్న సూర్యం అన్నను చంపాడని శిరీషకు ఆలస్యంగా అర్థమవుతుంది. చివరకు శిరీష, సూర్యాన్ని [illegible] .

కథలో ఏ కొంచెమూ కొత్తదనం లేదు. కథా గమనంలో కనిపించే మలుపులన్నీ పాత

తరువాయి 11వ పేజీలో

# వారఫలాలు

*10-6-2000తేది నుండి 16-6-2000తేది వరకు వృషభంలో గురు, శనులు మరియు 13తేది వరకు శుక్రుడు; 14తేది వరకు రవి; మిథునంలో 14తేది నుండి శుక్ర 15తేది నుండి రవి మరియు కుజ, బుధులు; కర్కాటకంలో రాహువు; మకరంలో కేతువు; కన్య, తులవృశ్చికాలలో చంద్రుడు.*

## మేషం
(అశ్విని, భరణి, కృత్తిక 1వ పాదం)

వృత్తి, వ్యాపార, వ్యవసాయ రంగాలలో ఆదాయం పెరుగుతుంది. సొంత పనులు, ప్రభుత్వ సంబంధిత పనులు మెల్లగా అనుకూలంగా జరుగుతాయి. వసూలు కావలసిన బాకీలు కొద్ది కొద్దిగా లభిస్తాయి. ఆర్థికపరిస్థితి మెరుగవుతుంది. శుభకార్య ప్రయత్నాలు అనుకూలిస్తాయి. గృహ నిర్మాణ పనులు చాలా చేస్తారు. అధికారుల సహకారంతో అదనపు బాధ్యతలు చక్కగా నిర్వహిస్తారు. వారాంతంలో స్వల్ప అనారోగ్య బాధలుంటాయి.

## వృషభం
(కృత్తిక 2,3,4పాదాలు, రోహిణి, మృగశిర 1,2 పాదాలు)

ఆర్థిక పరిస్థితి, ఆదాయం వృద్ధి చెందుతుంది. ప్రయాణాలు జరుగవచ్చును. శుభకార్య ప్రయత్నాలు నెరవేరగలవు. వృత్తి, వ్యాపార, వ్యవసాయ రంగాల వారికి ఆశాజనకంగా ఉంటుంది. రావలసిన బాకీలు కొంత పొందగలుగుతారు. మాటకు విలువ, గుర్తింపు గౌరవాలు పొందుతారు. ఆరోగ్యం బాగానే ఉంటుంది. పనులు సవ్యంగా జరుగుతాయి. కొత్త వస్తువులు కొంటారు. వివాద పరిష్కారాలు, పలుకుబడి ఉంటుంది.

## మిథునం
(మృగశిర 3,4 పాదాలు, ఆర్ద్ర, పునర్వసు 1,2,3 పాదాలు)

అదనపు ఖర్చులు ఎక్కువ కాగలవు. ఆదాయం సామాన్యంగా ఉంటుంది. వ్యాపార వృద్ధికి పెట్టుబడులకు ప్రయత్నాలు చేస్తారు. ఉద్యోగ సంబంధమైన సమస్యలు, ఆర్థిక సమస్యలు కలిగి తొలగుతాయి. ఆరోగ్యం కొద్దిగా లోపిస్తుంది. వినతం, స్థిరాస్తుల లావా దేవీలు జరగడం ఉంటుంది. రాజకీయ పలుకుబడి పెరుగుతుంది.

## కర్కాటకం
(పునర్వసు 4 పాదం, పుష్య, ఆశ్లేష)

అనుకున్న పనులు సక్రమంగా జరగవు. రావలసిన ఆదాయం, ప్రభుత్వం వల్ల రావలసిన డబ్బు ఆలస్యం అవుతుంది. కుటుంబంలో అపార్థాలు, విభేదాలు కనపడగలవు. వృత్తి, వ్యాపార, వ్యవసాయ రంగాలలో ఆదాయం తగ్గి ఆర్థిక ఇబ్బందులు కలుగుతాయి. అధికారుల వత్తిడి పెరుగుతుంది. అనవసర ప్రయాణాలు, వస్తు నష్టం, బిడ్డల వల్ల ఖర్చులు పెరుగుతాయి. మనస్తిమితం తక్కువ. రాజకీయ, సాంస్కృతిక రంగాల వారికి మంచి సమయం కాదు.

## సింహం
(మఖ, పుబ్బ, ఉత్తర 1వ పాదం)

ఆర్థికస్థితి బాగుంటుంది. కుటుంబంలో విభేదాలు సర్దుకొని, కలసి కట్టుగ కుటుంబ సభ్యులు మిమ్ములను సమర్థిస్తారు. వృత్తి, భాగస్వామిగా వ్యాపారంలో చేరటం జరుగవచ్చును. బిడ్డలకై ఖర్చులుండి, అభివృద్ధి బాగుంటుంది. ఉద్యోగ నిర్వహణలో సన్నిహితుల వల్ల సమస్యలు రావచ్చు. జీవిత భాగస్వామికి ఆరోగ్యం బాగుండదు.

## కన్య
(ఉత్తర 2,3,4 పాదాలు, హస్త, చిత్త 1,2పాదాలు)

ఆరోగ్యం బాగుంటుంది. ఆలోచనలు ఎక్కువ ఆచరణ తక్కువ. కుటుంబంలో స్వల్ప విభేదాలు ఏర్పడి సర్దుకుంటాయి. రావలసిన డబ్బు కొంత వరకు లభించె సూచనలున్నాయి. స్థిరాస్తుల క్రయవిక్రయాలు, తగాదాల పరిష్కారం జరుగుతుంది. విద్యార్థులకు విద్యాపరిశ్రమ బాగా జరుగుతుంది. సాహిత్య, సాంస్కృతిక రంగంలో సన్మానాలు ఆహ్వానాలు లభించవచ్చును. ఆదాయం ఈ రాశి వారికి బాగుంటుంది.

## పంచాంగం

**మృగశిర కార్తె**

*15తేది గురువారం మిలాదినబి శుక్ర మౌఢ్యమి జరుగుచున్నది*

**జూన్ తిథులు**

**జ్యేష్ఠ శుద్ధ**

| | | | | |
|---|---|---|---|---|
| తేది 10 | శని | నవమి | రా 11.46 | గం.వ |
| తేది 11 | ఆది | దశమి | రా 11.15 | గం.వ |
| తేది 12 | సోమ | ఏకాదశి | రా 10.50 | గం.వ |
| తేది 13 | మంగళ | ద్వాదశి | రా 11.10 | గం.వ |
| తేది 14 | బుధ | త్రయోదశి | రా 11.54 | గం.వ |
| తేది 15 | గురు | చతుర్దశి | రా 1.05 | గం.వ |
| తేది 16 | శుక్ర | పౌర్ణమి | రా 2.45 | గం.వ |

**స్వయంపాకుల శ్రీనివాసులు, ఎం.ఏ.**

## తుల
(చిత్త 3,4పాదాలు, స్వాతి, విశాఖ 1, 2, 3 పాదాలు)

సొంత పనులుగాని, ఉద్యోగ పనులు గాని జాగ్రత్తగా చేయాలి. చిన్న చిన్న తగాదాలు జరుగవచ్చును. బంధువులలో విభేదాలు రావచ్చును. స్థిరాస్తులపై రాబడి సరిగా రాదు. ఉద్యోగులకు స్థానమార్పు. రావలసిన బాకీలు కొద్దిగా లభిస్తాయి. వ్యాపార, స్థిరాస్తుల లావాదేవీలు జరుగుతాయి.

## వృశ్చికం
(విశాఖ 4 పాదం, అనూరాధ, జ్యేష్ఠ)

ఆరోగ్యం కాపాడుకొనడానికి జాగ్రత్తలు వహించాలి. కుటుంబంలో అశాంతి, అభిప్రాయ భేదాలు కలుగవచ్చును. మీ కోపం, విసుగు వల్ల ఇతరులతో తగాదాలు రాగలవు. అధికారులను కూడా గమనించుకొని నడుచుకొనవలెను. అనుకోని ప్రయాణాలు, అదనపు ఖర్చులు తప్పవు. ఆస్తి వ్యవహారాలు వాయిదా కోరడం మేలు. పెట్టుబడులు లాభించవు.

## ధనుస్సు
(మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1పాదం)

కుటుంబ సభ్యులకు ఆరోగ్యం సరిగా ఉండదు. స్థిరాస్తి వ్యవహారాలు, గృహ నిర్మాణ పనులకు ఆటంకాలు రావచ్చును. ఉద్యోగస్థులకు అదనపు బాధ్యతలు పైనబడినా, అధికారుల అనుకూలత బాగుంటుంది. వృత్తి, వ్యాపార, వ్యవసాయ రంగాల వారికి ఆదాయం బాగుంటుంది. ఆర్థికాభివృద్ధి అవకాశాలు లభిస్తాయి. సాంస్కృతిక, రాజకీయ రంగాల వారికి గుర్తింపు గౌరవం బాగుంటుంది.

## మకరం
(ఉత్తరాషాఢ 2,3,4 పాదాలు, శ్రవణ, ధనిష్ఠ 1,2 పాదాలు)

వృత్తి, వ్యాపార రంగంలో ఆశించినంత ఆదాయం రాదు. అనవసర వివాదాలలో చిక్కుకొనే అవకాశాలున్నాయి. సన్నిహితుల వల్ల చిన్న చిన్న సమస్యలు రావచ్చును. ఆరోగ్యలోపం లేదు. కుటుంబ సభ్యుల అనుకూలత బాగుంటుంది. శుభకార్య పెత్తనం వహించవలసి రావచ్చును. పెట్టుబడుల రంగంలో అనుకూలత ప్రయోజనం స్వల్పంగా ఉంటుంది. పనులు నిదానంగా జరుగుతాయి. అధికారుల విముఖత ఎదుర్కోవలసి రావచ్చును. తగాదాలు, కేసులు పరిష్కార దిశగా ప్రయత్నించండి. విద్యాకృషి బాగుంటుంది.

## కుంభం
(ధనిష్ఠ 3,4 పాదాలు, శతభిష, పూర్వాభాద్ర 1,2,3 పాదాలు)

ఈ రాశి వారికి ఆర్థికస్థితి బాగుంటుంది. రావలసిన బాకీలు, చెల్లించవలసిన బాకీలు కొంత మేరకు జరిగిపోతాయి. కుటుంబ సభ్యుల సహకారం బాగుంటుంది. దూర ప్రయాణాలు, కొత్త పరిచయాలు, కొత్త వస్తువులు కొనడం జరుగుతుంది. ఉద్యోగులకు బాధ్యతల శ్రమ పెరిగినా, అధికారుల సహాయం బాగుంటుంది. ఆర్థిక లావాదేవీలలో లాభముంటుంది. ఉద్యోగావకాశాలు, స్థానచలనం జరుగవచ్చును.

## మీనం
(పూర్వాభాద్ర 4 పాదం, ఉత్తరాభాద్ర, రేవతి)

ఆర్థిక పరిస్థితి బాగుంటుంది. బంధుగణంలో కొంత భేదాభిప్రాయాలు రావచ్చును. ఆర్థికావసరాలు కలిగి ఋణం చేయవలసి రావచ్చును. ఆరోగ్యం బాగుండదు. కుటుంబ సభ్యులకు కూడా ఆరోగ్యం సరిగా ఉండదు. ఉద్యోగబాధ్యతలు సక్రమంగా జరిగిపోతాయి. కొన్ని పనుల నిర్వహణ బాధ్యత మీపైన పడవచ్చును. దూర ప్రయాణాలుంటాయి. సాంస్కృతిక రాజకీయ రంగాల వారికి ఆదరణ బాగుంటుంది. వారాంతంలో అనవసర వివాదాలలో తలదూర్చటం జరుగుతుంది. బంధుమిత్రులకు సహాయపడవలసి రావచ్చును.

---

## జనవాణి

మూడవ పేజీ కొరవ

చేయబోయారు మరో దొంగ. బాలాజీనగర్ పోలీస్ స్టేషన్‌కు కొత్త ఎస్‌ఐ వచ్చారు. ఈయన ఈ దొంగ తనాలపై దృష్టి కేంద్రీకరిస్తే బాగుంటుంది.

నెల్లూరు — ఎస్.వి.ఎస్. సత్యస్వరూప్





## అందరికీ తగిన గౌరవమివ్వాలి!

పిసిసి అధ్యక్షునిగా ఎం. సత్యనారాయణ రావు నియామకం ఆనందకరం. ఈయన గతంలో పిసిసి అధ్యక్షుల వలె ముఠా రాజకీయాలను ప్రోత్సహించకుండా అన్ని కులాలు, వర్గాల వారికి పిసిసి కార్యవర్గంలో చోటు కల్పించి, బాధ్యతలు పంచితే కాంగ్రెస్ పార్టీకి మంచిరోజులొస్తాయి. ఇటీవల జరిగిన మునిసిపల్ ఎన్నికల్లో నెగటివ్ ఓటుతో కాంగ్రెస్ పార్టీ చాలా స్థానాలు కోల్పోయింది. ఎన్నికలు వచ్చినప్పుడు దారిన పోయేవారికి టిక్కెట్లు ఇవ్వకుండా, పార్టీలో ఆది నుంచి అంకిత భావంతో పనిచేస్తున్న వారికి అవకాశమిస్తే బాగుంటుంది.

నెల్లూరు — టి.వి. నారాయణ

## యాభైఏళ్ల క్రితం

మూడవ పేజీ కొరవ

కలిపితే దీనికంటే 16వేల జనాభా మాత్రమే ఎక్కువ వుంటుంది. అనా ఫరవాలేదు. కాబట్టి ఉత్తరాదిన ఒక స్థానమున్ను, దక్షిణాదిన ఒక స్థానమున్ను సర్దడం బాగుంటుందేమో.

### పర్మినెంటు ఫండు

దీని విషయంలో అధ్యక్షుడుగా వుండి, కుంగిపోవడానికి సిద్ధంగా వున్న సంస్థకు జీవంపోసి పునర్జన్మ గలిగించి అభ్యుదయ పంథాలో పెట్టిన మన ప్రముఖ న్యాయవాది చివుకుల మాలెకొండయ్య గారికి మా ధన్యవాదాలు. దీని సెక్రటరీ బుడంగుంట ఆదెప్పయ్యగారు ఈ ఫండు తాలుకు డబ్బుకు షుమారు 12వేల రూపాయలు అపహరించి పరారీ అయినాడు - ఇతను ఈ డబ్బు గిండీ గుఱ్ఱపు పందెములకు పెట్టినాడని అంటున్నారు. మాచారా గుఱ్ఱపు పందెములు నెల్లూరు మండలీయులను యెంత మందిని దివాలా తీయిస్తున్నవో!

### కలెక్టర్

కొత్త కలెక్టర్ జోగప్పగారు 4తేదీ ఛార్జి తీసుకొన్నారు. పాత కలెక్టర్ మలయప్పన్‌గారు 10తేదీ వెళ్తారని తెలుస్తున్నది. జోగప్ప గారు బళ్లారి మండలీయులు. తెలుగు స్పష్టంగా మాట్లాడుతారు. వీరు లింగాయతులు. వీరశైవ యన్న మాట. ఆచార వ్యవహారాలు చాలా పట్టింపుగా వుంటుంది. కాని ఇతరులు ప్రచారం లేవ దీసినట్లు వీరు అస్పృశ్యతను పాటిస్తారని మేమెంత మాత్రం అనుకోము. ఉద్యోగ రీత్యా గూడా జొత్తుగా పాటించడానికి వీలు లేదు. కావున ఈ దుష్ప్రచారాలు నమ్మవద్దు.

### మునిసిపాలిటి

మునిసిపల్ కౌన్సిలర్లు యేమీ శ్రద్ధ వహించడం లేదు. అధ్యక్షుడు రాత్రింబవళ్లు కాంగ్రెస్ వ్యవహారములతోను, వేధించుక తినే ఇతర ప్రజల తోను వేగలేక పోతున్నారు. కౌన్సిలర్లయినా వారి వారి వార్డుల్లో తిరిగి మంచిచెడ్డ విచారించకుంటే ఎలక్షన్‌నాడు తప్ప మరెప్పుడైనా వారి ముఖం కనపడుతున్నదా? ప్రజాప్రతినిధులను కోవడమేగాని నామినేషన్ కౌన్సిల్లో వున్నంత గట్టి మెంబర్లే కాంగ్రెస్ పార్టీ పేరు చెప్పుకోడానికి వీరేమి అర్హతున్నదో కొంచెం చెప్పుకోమనండి. మద్రాసు కార్పొరేషన్ మెంబరు గద్దె రంగయ్య నాయుడువంటి ప్రజా సేవకులను చూచయినా నేర్చుకోవద్దా? ఆయన ఉదయం 7 గంటలకు రిక్షాలో బయలుదేరితే మధ్యాహ్నం 12 గంటలదాకా తన వార్డులో తిరిగి వారి మంచి చెడ్డలు విచారించి, అవసర సౌకర్యాలు చేకూర్చి, ఇల్లు చేరేవాడు. ఇట్లా ప్రతిదినం సేవ చేసేవాడు. అతని వార్డులో అతన్ని పోటీ చేసే మనిషే లేకుండా పోయాడు. వెనుక వెన్నెలకంటి రాఘవయ్య కౌన్సిలర్‌గా వుంటే ప్రతిదినం తన వార్డును యేవేళో ఒక వేళ చూచి అవసరాలు విచారించి తీర్చేవాడు. అట్లా గదా కౌన్సిలర్లు వుండవలె. ఇకనైనా నేర్చుకొంటారని ఆశిస్తున్నాము.

### గుఱ్ఱపు పందెములు

పల్లగాలిగోగాక ఆనంద పరవశాన్నిచ్చే మత్తు పదార్థాల స్వేచ్ఛా విహారానికి సుప్రసిద్ధం ఒనంబరగిన బెంగుళూరు పురవరంబులో జరిగిన గుఱ్ఱపు పందెముల కుంజనిన సుప్రసిద్ధ ఫలావు నిర్మాత బుఖారాదిరెడ్డి యువప్రముఖ బృందం తిత్తి కాసులు రాల్చుకొని ఆల్విదా బాదుకొంటూ ముఖములు వ్రేలాడవేసుకొని దిగుమతి అయిరి. ఇందులో 10వేలు మొదలుకొని ఎవరెవరి దామాషా ప్రకారం వారు వారు చెల్లించుకొని చరితార్థులైన వారే.

సోదరులారా! ఈనాటకైనా ఈ గుఱ్ఱపు పందెములు వాలించుకొని నాగరిక ప్రపంచంలో పడరా?

-విమర్శకుడు

## నెల్లూరుసంగతులు

4వ పేజీ కొరవ

రద్దు చేయాలని కోరుతూ 5వతేదీ ఉదయం 9 గంటల నుంచి 12 గంటల వరకు వామపక్షాల ఆధ్వర్యంలో విద్యుత్ భవన్ వద్ద పికెటింగ్ జరిగింది. ఈ సందర్భంగా గుమిగూడిన పార్టీ కార్యకర్తల నుద్దేశించి సిపిఎం రాష్ట్ర కమిటీ సభ్యుడు టి.వి. భానురాజు మాట్లాడారు. కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు ప్రజావ్యతిరేక విధానాలను అవలంబిస్తూ ప్రజలపై భారం మోపుతున్నాయి. ఇందులో భాగంగానే సబ్సిడీ బియ్యం, కిరోసిన్, గ్యాస్ ధరలు ఇటీవల పెంచారు. ప్రజలకు షాక్ ఇచ్చే రీతిలో విద్యుత్ ఛార్జీలను పెంచి కోలుకోలేని స్థితి తెచ్చి పెట్టారు. ప్రజలంతా ఐక్యంగా ఉద్యమించి పెంచిన ఛార్జీలను రద్దు చేసే వరకు ఉద్యమాన్ని కొనసాగిస్తే తప్ప ఫలితం కానరాదన్నారు. పికెటింగ్‌లో సిపిఐ జిల్లా కార్యదర్శి ఎం. రామచంద్రయ్య, సిపిఐ (ఎం.ఎల్) కమిటీ నాయకులు దామా వెంచయ్య, సిపిఐ (ఎం.ఎల్) న్యూడెమొక్రసీ నాయకులు కొండయ్య, సిపిఎం పార్టీకి చెందిన కె.జనార్దన్, చంద్రరాజగోపాల్, మాదాల వెంకటేశ్వర్లు, అరిగెల రమణమ్మ, నరహరి తదితరులు పాల్గొన్నారు.

### చంద్రమౌళినగర్ వాసులకు పట్టాలివ్వండి

నెల్లూరు ఎమ్మెల్యే వివేకానందరెడ్డి తాను సృష్టించుకొన్న ప్రజాపథంలో భాగమైన పరిష్కార సాధన కార్యక్రమంలో 5వతేదీ ఎమ్మార్వో కార్యాలయాన్ని చేరుకొని ప్రజల వద్ద నుంచి పలు సమస్యలపై విజ్ఞాపన పత్రాలు స్వీకరించారు. 21వార్డు ప్రజలు అధిక సంఖ్యలో వచ్చి తాము గత 20ఏళ్లుగా చంద్రమౌళినగర్, జ్యోతినగర్ ప్రాంతాల్లో కాపురముంటున్నామని, తమకు నర్ల పట్టాలు లేవని, గతంలో రెవిన్యూ అధికారులు ఈ స్థలాలను సర్వేచేసి వాటికి ఇప్పటి ధరల ప్రకారం డబ్బులు చెల్లించమని నోటీసులిచ్చారని ఎమ్మెల్యేకు తెలియజేశారు. తామంతా పేద, మధ్యతరగతి వారమని రెవిన్యూశాఖ వారు చెల్లించమని చెప్పిన రీతిలో డబ్బులు కట్టలేమని చెప్పగా, ఎమ్మెల్యే, ఎమ్మార్వో పెంచలరెడ్డితో మాట్లాడి ఈ ప్రాంతీయులందరికీ ఉచితంగా ఇళ్లపట్టాలు మంజూరు చేయమని చెప్పారు. రాజీవ్ గాంధీ కాలనీలో నివసించే వారికి పట్టాలు ఇవ్వమని జి.ఓ. విడుదలైనా రెవిన్యూ అధికారులు ఇవ్వక పోవడం పట్ల ఎమ్మెల్యే అభ్యంతరాన్ని వ్యక్తం చేశారు. తాను ఈ విషయాలను ప్రభుత్వం దృష్టికి తీసుకువెళతానని ఎమ్మార్వో, ఎమ్మెల్యేకి హామీ ఇచ్చారు. ఈ కార్యక్రమంలో కౌన్సిలర్ పుట్టా రామకృష్ణారెడ్డి, కాంగ్రెస్ నాయకులు పలగాని సుధాకర్‌రెడ్డి, గోవర్ధన్‌రెడ్డి, సుబ్బారావు, రూబిన్, పొదుపులక్ష్మి గ్రూప్, చంద్రమౌళినగర్, జ్యోతినగర్ ప్రాంత మహిళలు పెద్ద సంఖ్యలో పాల్గొన్నారు. చంద్రమౌళినగర్‌లో పట్టాలు లేని స్థలాలే హాటు కేకుల్లా అమ్ముడవు తున్నాయి. ఒకవేళ వుచితంగా పట్టాలిస్తే అర్హుల ఎంపికను రెవిన్యూ అధికారులు నిజాయితీగా చేయాలి.

### పోలీసులకు సహకరించండి

జిల్లాలో శాంతి భద్రతల పరిరక్షణలో పోలీసులకు ప్రతి ఒక్క పౌరుడు సహకరించాలని ఎస్పీ టి. రవికుమార్ మూర్తి కోరారు. ట్రాఫిక్ పోలీసులు సూచించిన విధంగా నిర్ణీత ప్రాంతాల్లో పార్కింగ్ చేయడం వల్ల పలు నేరాలను నిరోధించిన వారవుతారన్నారు. ఇటీవల కాలంలో మచిలీపట్నం, మెదక్‌లోని చర్చిలలో జరిగిన సంఘటనలు మత విద్వేషాలను రెచ్చగొట్టేందుకు విచ్ఛిన్నకర శక్తులు చేస్తున్న పనిని ఎస్పీ అభిప్రాయపడ్డారు. పౌరులు తాము నివసిస్తున్న చుట్టుప్రక్కల ప్రాంతాల్లో అనుమానాస్పద వ్యక్తులు ఎవరైన తారసపడితే వారి వివరాలు పోలీసులకు తెలియజేసి శాంతిభద్రతల సమస్యలు లేని జిల్లాగా నెల్లూరును చేయను సహకరించాలన్నారు.

### ఎల్ఐసి సిరాస్తులు లక్షా 60వేల కోట్లు!

లైఫ్ ఇన్సూరెన్స్ కార్పొరేషన్ ఆస్తుల విలువ ఈ యేడాది లక్షా 60వేల కోట్లకు పెరిగి 21.28శాతం అభివృద్ధి నమోదైనట్లు ఎల్ఐసి ఛైర్మన్ జి.కృష్ణమూర్తి పంపిన వివరాలను నెల్లూరు డివిజనల్ మేనేజర్ పత్రికల వారికి చెప్పారు. సంస్థ మొత్తం ఆదాయంగా 45,174.15 కోట్లు వచ్చాయని, దీనిలో ప్రీమియం ఆదాయం 27,849.76 కోట్లని, ఇన్వెస్టుమెంట్లు, అద్దెల ద్వారా 16,113.11 కోట్లు, ఈక్విటీ అమ్మకాల ద్వారా 84,547 కోట్లు లాభాలార్జించినట్లు చెప్పారు. గత యేడాది పట్టాదారులకు 9106.02కోట్లు చెల్లింపులు చేయగా, ఈ యేడాది 11,170.50 కోట్లు చెల్లించారట. మరి ఇన్నికోట్ల లాభాలున్న సంస్థ ప్రైవేటీకరణకు ప్రభుత్వం ఎందుకు ప్రయత్నిస్తున్నట్లు?

### వికలాంగ బాలికల కోసం ప్రత్యేక హాస్టల్

జిల్లాలో పాఠశాలకు వెళ్లే శారీరక వైకల్యం కల్గిన బాలికలకై నెల్లూరులో నడుపబడుతున్న ప్రభుత్వ వికలాంగ బాలికల వసతి గృహంలో ఈ యేడాది ప్రవేశానికి దరఖాస్తులు కోరుతున్నారు. ఈ ప్రత్యేక వసతి గృహంలో చేరి 1వ తరగతి నుంచి 10వ తరగతి వరకు చదువుకోవచ్చు. దరఖాస్తులను బోసు బొమ్మ వద్దగల డాక్టర్ అంబేద్కర్ సంక్షేమ భవన్‌లోని రూము నెం.2లో గల తమ కార్యాలయం నుంచి పొందవచ్చని వికలాంగుల సంక్షేమ శాఖ సహాయ సంచాలకురాలు డి.వాణి తెలియజేశారు. పూర్తి చేసిన దరఖాస్తులను జూన్ 20వ తేదీ వరకు స్వీకరిస్తారు.

### పంచాయతీ ఇఓలు అప్రమత్తంగా ఉండండి

జిల్లాలో కొన్ని గ్రామాల్లో త్రాగునీటి సమస్య వున్నందువల్ల కలుషిత నీరు త్రాగి ప్రజలు అతిసార వ్యాధి పడే ప్రమాదం వున్నందున పంచాయతీ ఇఓలంతా అప్రమత్తంగా వుండాలని జిల్లా పంచాయతీ అధికారి వి. సత్యసాయి శ్రీనివాస్ కోరారు. విధి నిర్వహణలో అప్రమత్తంగా లేనివారిపై కఠిన చర్యలు తీసుకోంటానంటున్నారాయన. ముందు గ్రామాల్లో త్రాగునీటి సమస్య పరిష్కారానికి దారులు వెతకండి. ఆ తర్వాత అతిసారం సంగతి చూద్దురుగానీ డిపిఓగారు!

### లేపాక్షి నోటు పుస్తకాల విక్రయం!

ఆంధ్రప్రదేశ్ స్టేట్ ట్రేడింగ్ కార్పొరేషన్ లేపాక్షి నంది నోటు పుస్తకాలను నెల్లూరుటౌన్ స్టోన్‌హౌస్‌పేటలోని మానవహక్కుల సేవా సమాజ్ కార్యాలయంలో అమ్ముతారు. క్వాలిటీ బాగుండే ఈ నోటు పుస్తకాలు 192 పేజీలు చిన్నవి బౌండు 8 రూపాయలు, 96 పేజీలు 5 రూపాయలు, 96పేజీలు అన్‌బౌండ్ 4.10పైసలు, 48పేజీలు అన్‌బౌండ్ 2.30, 192పేజీలు లాంగ్‌సైట్ 17రూపాయలు, 192పేజీలు లాంగ్‌సైట్ రూళ్ళ 17.25పైసలకు అమ్ముతున్నట్లు మానవ హక్కుల సమాజ్ సంస్థ నిర్వాహకులు తెలిపారు. పోరుం తెలివరిగా 5శాతం డిస్కౌంట్ కూడా ఇస్తారట. అయితే కాస్త ఓపిక చేసుకొని స్టోన్‌హౌస్‌పేట వరకు వెళ్లాలి.

### మిలీనియం అచీవర్ అవార్డు

నెల్లూరుకు చెందిన ఎమ్వీ రమణయ్య పేరు మిలీనియం అచీవర్స్ 2000 రికార్డులలో నమోదయ్యింది. దేశంలోని వివిధ రంగాలకు చెందిన 99 మందిని మిలీనియం విశిష్ట వ్యక్తులుగా న్యూఢిల్లీలోని ఆలిండియా అచీవర్స్ కాన్ఫరెన్స్ వారు ఎంపిక చేసి తమ రికార్డులలో నమోదు చేస్తారు. ఇంగ్లీషు, హిందీ భాషల్లో నిష్ణాతులైన రమణయ్య కడప, చీరాల, రాజమండ్రి, ప్రొద్దుటూరు కళాశాలల్లో లెక్చరర్‌గా పనిచేశారు. విద్యార్థులకు బోధనా పద్ధతులలో ఆయన అవలంభించే తీరు విశిష్టమైంది. సూళ్లూరుపేట, మంచిర్యాల, బుచ్చిరెడ్డిపాళెం డిగ్రీ కళాశాల ప్రిన్సిపల్‌గా వ్యవహరించిన రమణయ్య అనేకసార్లు పరీక్ష పత్రాల తయారీలోనూ పాల్గొన్నారు. నెల్లూరు కీర్తి ప్రతిష్టలు పెంచిన రమణయ్యకు మా అభినందనలు.

### పది పక్కా ఇళ్లకు ఒక ఇంకుడు గుంట

బడుగు, బలహీన వర్గాల వారికి గృహనిర్మాణ సంస్థ నిర్మించే ప్రతి 10 పక్కా గృహాలను కలిపి ఒక ఇంకుడు గుంటను ఏర్పాటు చేసేందుకు నిర్ణయించినట్లు ఇళ్ల మంత్రి ఆదాల ప్రభాకరరెడ్డి చెప్పారు. ఇటీవల మూడవ శనివారాన్ని పురస్కరించుకొని క్లీన్ అండ్ గ్రీన్ కార్యక్రమంలో భాగంగా నెల్లూరు హౌసింగ్ కార్పొరేషన్ ఆవరణలో ఇంకుడు గుంటలను ప్రారంభించి అనంతరం ఏర్పాటు చేసిన సభలో మాట్లాడారు. ఇంకుడు గుంటలు ఏర్పాటు చేయడం వల్ల భూగర్భ జలాలు వృద్ధికాగలవని ప్రభుత్వ ప్రైవేటు భవనాల ఆవరణాల్లో తప్పనిసరిగా ఇంకుడు గుంటలు ఏర్పాటు చేసుకోవాలన్నారు. ప్రభుత్వ కార్యాలయాలు, పాఠశాలలు, ఆసుపత్రులు ఇతర కార్యాలయాల్లో రైన్ వాటర్ హార్వెస్టింగ్ స్ట్రక్చర్లు ఏర్పాటు చేయాలని మంత్రి సూచించారు. పట్టణాలల్లోనే కాకుండా గ్రామాల్లో కూడా నీటిని సద్వినియోగ పర్చుకొను అటు రైతులు, ఇటు ప్రజల్లో అవగాహన పెంపొందించాలన్నారు. 12వ విడత జన్మభూమి కార్యక్రమంలో జిల్లాను అగ్రస్థానంలో నిలిపినట్లు అదే విధంగా క్లీన్ అండ్ గ్రీన్‌లో కూడా నిలపాలని మంత్రి పిలుపు నిచ్చారు. ఇక్కడ నుంచి బయలు దేరి నెల్లూరు ఆర్డీఓ, ఎమ్మార్వో, రూరల్ పోలీసు, మండల పరిషత్, రోడ్లు భవనాల శాఖ కార్యాలయాల ఆవరణల్లో ఏర్పాటు చేసిన 13 ఇంకుడు గుంటలను మంత్రి ఆదాల ప్రభాకరరెడ్డి, జిల్లా కలెక్టర్ శ్రీలక్ష్మి ప్రారంభించారు. ఈ కార్యక్రమంలో హౌసింగ్ జిల్లా మేనేజర్ రవిప్రకాష్, ఆర్డీఓ వెంకటేశ్వర్లు, ఎమ్మార్వో బి.రామిరెడ్డి, ఎమ్డీఓ వసుమతి తదితరులు పాల్గొన్నారు.

## సినిమా

9వ పేజీ కొరవ

ముందుగా ఒప్పందాలు చేసుకొని వుండటం వల్ల అవకాశాలు వచ్చినా కొన్ని తెలుగు చిత్రాల్లో చేయలేక పోయాను. డేట్స్ కుదరక ఎలాగైనా చేయాలన్పించజేసేంతగా బెస్ట్ చేసే ప్రాజెక్ట్ చెప్పుకోదగ్గ రీతిలో రాకపోవడం వల్ల తెలుగు చిత్రాలు తగ్గినట్లు ఒప్పుకొంది.

## నారాయణ

4వ పేజీ కొరవ

విద్యార్థి అయినా ఇన్ని ర్యాంకులు రాలేదు. సాధారణంగా ఐఐటిలో చేరేందుకే ర్యాంకులు తెచ్చుకొన్న విద్యార్థులు మొగ్గుతుంటారు. త్రిబుల్ ఐటిలో 11వ ర్యాంకర్ మైథిలీ రంగనాథ్, 92వ ర్యాంకర్ సిద్ధార్థ ఐఐటిలో చేరుతామని చెప్పినా, 16వ ర్యాంకర్ ఉపేందర్ రెడ్డి మాత్రం త్రిబుల్ ఐటిలోనే చేరుతానన్నాడు. 62వ ర్యాంకర్ అవినాష్, 76వ ర్యాంకర్ శ్రీధర్‌రెడ్డి ఎందులో చేరాలన్న విషయమై ఇంకా నిర్ణయించుకోలేదన్నారు. రాష్ట్ర జాతీయ స్థాయిలో జరిగిన 5 ప్రవేశ పరీక్షా ఫలితాల్లోనూ తమ కోచింగ్ సెంటర్‌లో శిక్షణ పొందిన విద్యార్థులు జయకేతనం ఎగుర వేయడం పట్ల సంస్థ అధినేత నారాయణ ఆనందాన్ని వ్యక్తం చేశారు. ఢిల్లీలోని రూర్కీ విశ్వవిద్యాలయం నిర్వహించిన ప్రవేశ పరీక్షలోనూ మైథిలీ రంగనాథ్ 7వ ర్యాంకు, కళ్యాణ చక్రవర్తి 100వ ర్యాంకు 1732 ర్యాంకులలోపు మరో 7 మంది ర్యాంకులు సాధించడం పట్ల నారాయణ వాఖ్యానిస్తూ సంస్థ బాధ్యత మరింతగా పెరిగిందన్నారు. తమ విజయాలకు చక్కగా బోధించే ఉపాధ్యాయులు, చెప్పినట్లు విని కష్టపడి చదివిన విద్యార్థులు కారణమన్నారు.

## చిత్రసమీక్ష

9వ పేజీ కొరవ

ధోరణిలో వున్నాయి. అందువల్ల కథలో పట్టు చిక్కదు. కథ తమిళ రచయిత పళని వేలన్ రచించారు. తెలుగు వాడైన ముత్యాల సుబ్బయ్య చిత్రానికి దర్శకత్వం వహించాడు. తన దర్శకత్వంలోని మెళుకువలతో చిత్రాన్ని కొంత వరకు రక్తి కట్టించ గలిగాడు. కన్నడ నటుడు ఉపేంద్ర హీరో సూర్యం "పాత్రను పోషించాడు. తన స్వీయ దర్శకత్వంలో లాగా హీరోపాత్రలో విచ్చల విడి విహారం లేకుండా ముత్యాల సుబ్బయ్య దర్శకత్వంలో కొంత అదుపులో వుండి పాత్రను సక్రమంగా పోషించాడు ఉపేంద్ర. శిరీష పాత్ర చాలా ముఖ్యమైంది. రమ్యకృష్ణ ఆ పాత్ర ప్రాముఖ్యతను తన నటనతో నిలిపింది. రాశికి అవకాశం లేదు. నాగేంద్రబాబు నటన బాగుంది. చాటుమాటు విలనీ నడిపించటంలో సూర్య, జయప్రకాష్ రెడ్డి క్రూరంగా కనిపించారు. పోసాని కృష్ణమురళి మాటలు కొన్ని సన్నివేశాల్లో బాగా కుదిరాయి. కోటి సంగీతంలో పాటలు వినతగ్గవిగా వున్నాయి.

## చట్టుబండలే

4వ పేజీ కొరవ

కృషి చేస్తుంది. అంగన్‌వాడీ వర్కర్లు కుటుంబ సంక్షేమ పథకాలు అమలుకు ఇల్లిల్లు తిరుగుతున్నారు. సేవా సదనాలను, బాల సదనాలను రాష్ట్ర వ్యాప్తంగా క్రమశిక్షణతో నిర్వహిస్తున్నాం. మహిళలకు జీవిత భీమా పాలసీ సౌకర్యం కల్పించే ఆలోచన ముఖ్యమంత్రి చంద్రబాబు నాయుడిలో వుందని, బహుశా రాబోయే మహిళా జన్మభూమి కార్యక్రమంలో ఇది కార్యరూపం దాలుస్తుం దన్నారు.

## గుడ్డిదీపాలు

4వ పేజీ కొరవ

నెల్లూరులో రాష్ట్ర మైనార్టీ ఫైనాన్స్ కార్పొరేషన్ కార్యాలయాన్ని సందర్శించారు. ఫైనాన్స్ కార్పొరేషన్ జిల్లా మేనేజర్ దిలావర్ అలీ ముస్లిం మైనార్టీలకు ప్రభుత్వం అందించే వివిధ పథకాల గూర్చి ఎమ్మెల్యేకు తెలియజేశారు. రుణాల విషయాన్ని ఎమ్మెల్యే ప్రస్తావించగా గత ఏడాది 750 మందికి రుణాలిచ్చామని 73శాతం రీపేమెంట్ జరిగిందని మేనేజర్ బదులిచ్చారు. 73శాతం రుణాలు తిరిగి కట్టడం గొప్ప విషయమని, రుణాలు చెల్లించిన వారికి తిరిగి రుణాలిచ్చి ప్రోత్సహించాలని ఎమ్మెల్యే సూచించారు. స్కాలర్ షిప్పుల కోసం విద్యార్థుల నుంచి 650 దరఖాస్తులొచ్చినా నిధులులేని కారణంగా ఇవ్వలేక పోయినట్లు మేనేజర్, ఎమ్మెల్యేకు తెలియజేశారు. ఈ విషయమై సంబంధిత శాఖా మంత్రికి డి.ఓ. లెటర్ వ్రాస్తానని వివేకానందరెడ్డి చెప్పారు. ఈ సందర్భన కార్యక్రమంలో మునిసిపల్ వైస్ ఛైర్మన్ నందాసిబాషా, నల్లాబషీర్, ఊటుకూరు నాగేశ్వరరావు పాల్గొన్నారు.



**ఉత్తరక్రియలు**

సహృదయులు, మాకు మార్గదర్శి అయిన మా తండ్రిగారు

**శ్రీ నెల్లూరు సుందరరాజారామిరెడ్డి**

30.5.2000 తేది మంగళవారం స్వర్గస్థులైనారు.

కీ.శే.నెల్లూరు సుందరరాజారామిరెడ్డి
నార్తుమోపూరు

వారి పెద్దకర్మ 15.6.2000 తేది బేస్తవారం నార్తుమోపూరు నందు జరుగును. కావున తెలియజేయడమైనది.

కుమారుడు : నెల్లూరు సుకుమార్‌రెడ్డి

సోదరులు : నెల్లూరు వెంకారెడ్డి సుబ్బరామిరెడ్డి మల్లికార్జునరెడ్డి

# కరెంట్ షాక్ మన మంచికే

కష్టాల కడలిలో వున్న విద్యుత్ బోర్డును గట్టెక్కించేందుకు తెలుగుదేశం ప్రభుత్వానికి ఛార్జీలు పెంచక తప్పలేదని జిల్లా తెలుగుదేశం పార్టీ కన్వీనర్, ఉదయగిరి ఎమ్మెల్యే కంభం విజయరామిరెడ్డి చెప్పారు. 6తేది విలేఖరులతో మాట్లాడుతూ ప్రస్తుత తరుణంలో విద్యుత్

## కంభం ఉవాచ

ఛార్జీల పెంపు ప్రజల మంచికే నన్నారు. రాష్ట్రంలో విద్యుతుత్పాదనకు ప్రతియేటా 8,366 కోట్లు ఖర్చవుతుండగా, 5,445 కోట్ల రాబడి మాత్రమే వస్తూ, బోర్డుకు 2,918కోట్ల నష్టం వస్తుంది. దీన్ని దృష్టిలో పెట్టుకొని గత్యంతరం లేని పరిస్థితులలోనే విద్యుత్ ఛార్జీలు పెంచాల్సి వచ్చిందన్నారు. ఈ వ్యవహారంలో వాస్తవాలను కప్పిపుచ్చి రాజకీయం చేస్తూ కాంగ్రెస్ పార్టీ నాయకులు మాట్లాడు తున్నట్లు విజయరామిరెడ్డి చెప్పారు.

## టిక్కెట్ల అచ్చుతప్పులు - కండక్టర్లకు తిప్పలు!

నెల్లూరు 2 డిపోలో పనిచేసే ఆర్టీసి కండక్టర్లకిస్తున్న టిక్కెట్ల బ్లాకుల మధ్యలో జరుగుతున్న అచ్చు పొరపాట్ల వల్ల సీరియల్స్ మిస్ అయ్యి కండక్టర్లు నానా తిప్పలు పడాల్సి వస్తుంది. ఇందుకూరు పేటకు చెందిన బస్సు డ్యూటీలో వుండిన శ్రీనివాసులు అనే కండక్టర్

తొరువ 8వ పేజీలో



కుటుంబ నియంత్రణ అవార్డు ప్రదానోత్సవ సభలో ఈ కార్యక్రమాన్ని విజయవంతం చేసినందుకు జిల్లా కలెక్టర్ శ్రీలక్ష్మికి మెమెంటో బహూకరిస్తున్న ఇళ్లమంత్రి ఆదాల ప్రభాకర్ రెడ్డి

# ఇంకుడుగుంటల్లో జిల్లాకు దిగుడుస్థానం - బాబు ఆగ్రహం

ఇంకుడు గుంటల నిర్మాణంలో జిల్లా అట్టడుగు స్థానంలో వుందని ముఖ్యమంత్రి చంద్రబాబు నాయుడు, జిల్లా కలెక్టర్ శ్రీలక్ష్మితో తన అసంతృప్తిని వ్యక్తం చేశారు. 6తేదీ సాయంత్రం జరిగిన వీడియో కాన్ఫరెన్స్‌లో నీరు -మీరు, కరువు, విద్యుత్ ఛార్జీల పెరుగుదల అంశాలను సమీక్షించారు. జిల్లాలో ఇంకుడు గుంటల నిర్మాణ కార్యక్రమం ఊపందుకోవాలి. అన్ని ప్రభుత్వ కార్యాలయాల్లో 10 రోజుల్లో

## టెలికాన్ఫరెన్స్‌లో తెలిసిన నిజం

ఇంకుడు గుంటలను త్రవ్వి ఏర్పాట్లు చేయాలన్నారు. చెరువుల్లో వుండే ఆక్రమణలు తొలగించేందుకు నిర్దాక్షిణ్యంగా చర్యలు తీసుకోవాలి. వీరిలో పేదవారుంటే పునరావాసం కల్పించేందుకు జిల్లా అధికారులు శ్రద్ధ చూపించమని ముఖ్యమంత్రి కోరారు. చెరువుల్లో పూడిక తీతపనులు పూర్తయిన వెంటనే ఆ యంత్రాలను అటవీ ప్రాంతాల్లో కందకాలు త్రవ్వించేందుకు ఉపయోగించుకోవాలని సూచించారు. నీరు - మీరు కార్యక్రమాన్ని జిల్లాలో విజయవంతంగా నిర్వహించేందుకు జిల్లా మంత్రి ఛైర్మన్‌గా, కలెక్టర్ అధ్యక్షునిగా, డి.ఆర్.డి.ఎ ప్రాజెక్ట్ డైరెక్టర్ కన్వీనర్‌గా మరో 12 మంది సభ్యులుగా వుండే వాటర్ కన్సర్వేషన్ కమిటీలను ఏర్పాటు చేయాలని కోరారు.

విద్యుత్ వ్యవహారాన్ని ప్రస్తావిస్తూ జిల్లాలో 6,498 అక్రమ విద్యుత్ సర్వీసులున్నాయని వీటిని క్రమబద్ధీకరించేందుకు అధికారులు చర్యలు తీసుకోమన్నారు. విద్యుత్ వాడకాన్ని క్రమబద్ధీకరణ చేసి ట్రాన్స్‌ఫార్మర్ల వారీగా వినియోగదారుల జాబితాలు తయారు చేయమని విద్యుత్ శాఖ ఎస్‌ఇని కోరారు. సిఎంఇవై, పొదుపులక్ష్మి, స్వయం సహాయక గ్రూపుల ద్వారా విద్యుత్ వాడకం వివరాలతోపాటు, బిల్లుల చెల్లింపుల కార్యక్రమం చేపట్టమని సూచించారు. జిల్లా కలెక్టర్ శ్రీలక్ష్మి మాట్లాడుతూ జిల్లాలో ఇప్పటి దాకా 308 చెరువు పూడిక తీత, 200 చెక్‌డ్యాముల నిర్మాణానికి చర్యలు తీసుకొన్నట్లు చెప్పారు. జిల్లాలో 8వేల రొయ్యల చెరువులకు విద్యుత్ కనెక్షన్లు వున్నాయని వీటిలో పది హెచ్‌పి కన్నా ఎక్కువ సామర్థ్యం వున్న మోటార్లకే మీటర్లున్నట్లు చెప్పారు. వీడియో కాన్ఫరెన్స్‌లో జిల్లా ఎస్పీ సి.వి. నరసయ్య, జిల్లా రెవిన్యూ అధికారి పి. వెంకటేశ్వర్లు, విద్యుత్ శాఖ ఎస్‌ఇ కుమారస్వామిరెడ్డి పాల్గొన్నారు.

# చీప్ లిక్కర్ ఖార్ఖానా 'రాపూరు'

రాపూరులో రహస్యంగా పెద్ద ఎత్తున చీప్ లిక్కర్‌ను తయారు చేస్తున్నారు. చీప్ లిక్కర్‌ను టౌన్‌లోని ఏదైనా బ్రాందీ షాపులో పెట్టి విక్రయాలు చేస్తే లేనిపోని తంటాలు వస్తాయని తలచిన దీని తయారీదారుడు తాను సొంతంగా ఏర్పాటు చేసుకొన్న వాహనంలో మండలంలోని 72 బెల్టు షాపులనకు ఈ సరకును సరఫరా చేస్తున్నాడు. కడపలో చీప్

## సూత్రధారి అధికార పార్టీనేత

లిక్కర్ తయారుచేసే వ్యక్తులను తీసుకొచ్చి దీన్ని తయారు చేస్తున్నట్లు తెలిసింది. 20లక్షల మేర విలువ చేసే స్టాకున్న, ఈ చీప్ లిక్కర్‌ను 60లక్షల మేరకు మార్కెట్‌లో అమ్మవచ్చు. దీన్ని తయారు చేస్తున్న ఒక బ్రాందీ షాపు యజమాని ఎక్సైజ్ పోలీసులకు భారీగా ముడుపులు చెల్లిస్తుండడం వల్ల ఈ వ్యవహారాన్ని వీరు పట్టించు కోవడం లేదన్న విమర్శలు వినవస్తున్నాయి. ఈ ముఠాతో నియోజక వర్గ అధికార పార్టీ నేతకు నేరుగా సన్నిహిత సంబంధాలు ఉన్నాయని చెబుతున్నారు.

జిల్లాలో వెనుకబడిన ప్రాంతమని రాపూరుకు పేరున్నా, ఇక్కడ జరగని అక్రమ వ్యాపారాలు, మోసాలు లేవు. ఇక్కడ తయారు చేసి హైదరాబాద్‌లో చలామణి చేస్తుండిన 500 రూపాయల దొంగనోట్ల మిషన్‌ని ఇటీవల హైదరాబాద్ పోలీసులు ఛేధించే వరకు స్థానిక పోలీసులకు పొడకూడా లేదు. చీప్ లిక్కర్‌లో కల్తీ జాస్తయ్యి ఏదో ఒక ప్రమాదం జరిగితేకాని వృత్తాధికారులు స్పందించేటట్టు లేరు. అక్రమ వ్యవహారాల పట్ల జిల్లా యంత్రాంగం ఎందుకు నిర్లిప్తంగా చూస్తూ ఊరుకొంటుందో అర్థం కావడం లేదు.

## సొంత పార్టీ వారిని తిట్టిన దేవకుమార్

రాష్ట్ర పార్టీ నేతలు ఎన్నికల సమయంలో నియోజక వర్గం పట్ల అవగాహన లేని వ్యక్తికి కోవూరు టిక్కెట్ ఇవ్వడం వల్ల కాంగ్రెస్ పార్టీ ఓడిపోయిందని డిసిసి మాజీ కార్యదర్శి చేజెర్ల దేవకుమార్‌రెడ్డి వాపోయారు. 4తేది సంగం ట్రావెలర్స్ బంగళాలో పార్టీ కార్యకర్తల సమావేశం ఏర్పాటు చేసి సొంత పార్టీ వారినే తిట్టిన తిట్లు తిట్టకుండా తిట్టారు. 1983 నుంచి నియోజక వర్గంలో కార్యకర్తలకు అందుబాటులో వున్నాను. ఎన్నికలకు వచ్చే

## జిల్లావార్తలు

సరికి డబ్బున్న వారికి టిక్కెట్లు ఇస్తారు. మొన్నటి ఎన్నికల్లో టిక్కెట్ ఇచ్చిన జెకెరెడ్డికి డబ్బు తప్ప మరో అర్హత లేదనే విషయం, అప్పటి పిసిసి అధ్యక్షుడు వైయస్. రాజశేఖరరెడ్డికి కూడా తెలుసన్నారు. తనకు టిక్కెట్ ఇచ్చి వుంటే ప్రసన్నకుమార్‌రెడ్డి సునాయాసంగా గెలిచేవారు కాదన్నారు. జిల్లా యువజన కాంగ్రెస్ అధ్యక్షుడు

తొరువ 8వ పేజీలో

# అధికార్లపై ఎల్లసిరి జులుం!

రాపూరు నియోజక వర్గ పరిధిలో పనిచేస్తున్న అధికారులను మాజీ ఎమ్మెల్యే ఎల్లసిరి శ్రీనివాసులురెడ్డి వేధించుక తింటున్నాడు. గతంలో మాదిరే తనకు ముడుపుల మూటలు ఇవ్వమని సతాయిస్తున్నాడు. ఇంజనీరింగ్ శాఖాధికార్లపై నానా జులుం ప్రదర్శిస్తున్నాడు. తన మాట వినక, తాను చెప్పిన పనులను చేయని అధికారులను బదిలీకి సిద్ధంగా వుండమని హెచ్చరిస్తున్నారాయన. ఇటీవల రాపూరు మండలం కోటూరుపాడు గ్రామంలో అంగన్‌వాడీ భవన శంకుస్థాపనకు ఎమ్మెల్యే రామనారాయణరెడ్డి పూనుకొంటే ఎల్లసిరి శ్రీనివాసులురెడ్డి అనవసరంగా తెలుగుదేశం పార్టీ వారిని రెచ్చగొట్టి గ్రామంలో శాంతి భద్రతల సమస్యను సృష్టించాడు. అయినా లెక్క చేయని ఎమ్మెల్యే ఆనం రామనారాయణరెడ్డి ఈ శంకుస్థాపన నిరాటంకంగా పూర్తి చేశారు. ఈ శంకుస్థాపనకు గ్రీన్ సిగ్నల్ ఇచ్చినందుకు నెల్లూరులోని చైల్డ్ డెవలప్‌మెంట్ ప్రాజెక్ట్ ఆఫీసర్‌కు ఫోన్ చేసి ఎల్లసిరి బెదిరించినట్లు తెలిసింది. రాష్ట్రంలో అధికారంలో తెలుగుదేశం పార్టీ వుందని, జిల్లా మంత్రి తనమాటే వింటాడని జాగ్రత్తగా వుండమని హెచ్చరించడంతో ఆ మహిళాధికారిణి వణికి పోయిందట. ప్రజలు తిరస్కరించిన తర్వాత కూడా ఎల్లసిరి శ్రీనివాసులురెడ్డి రాపూరు ప్రజలు, అధికారుల మీద దౌష్ట్యం ప్రదర్శిం చడం తగదు. ఏం చేద్దాం తినమరిగిన కోళ్లు కదా? *





Edited, Printed and Published by N. Dolendra Prasad at Zaminryot Press. Ph: 091-861-327354, Offset Printing at Zamin Ryot Press, Nellore